# బైబిలిదర్శిని

## THE BIBLE HANDBOOK

Edited By

G. W. FOOTE & W. P. BALL

## 3. అత్యాచారాలు

అనువాదం

పెన్మెత్స సుబ్బరాజు

పశ్చిమ గోదావరిజిల్లా హేతువాద సంఘం

పాలకొల్లు - 534 260

# బైబిలు దర్శిని

# THE BIBLE HANDBOOK

Edited By

G. W. FOOTE & W. P. BALL

## 3. అత్యాచారాలు

అనువాదం

పెన్మెత్స సుబ్బరాజు

పశ్చిమ గోదావరిజిల్లా హేతువాద సంఘం

పాలకొల్లు - 534 260

BYBILUDARSINI - ATYACHARALU

*Translated by :*
PENMETSA SUBBARAJU

తొలిముద్రణ : అక్టోబరు 1986
ప్రతులు 1000

ప్రతులకు;
చార్వాక ఎంటర్‌ప్రైజస్
పెదగోపురంవద్ద
పాలకొల్లు - 534 260
ప. గోదావరిజిల్లా ఎ. పి.

రావిపూడి వెంకటాద్రి
ఎడిటర్, హేతువాది,
చీరాల - 523155.

వెల రు. 4/

* బైబిలు కేవలం శాంతివాదాన్ని ప్రతిపాదిస్తుందని ప్రచారం బాగా జరిగింది. కాని బైబిలులో దేవుడి పేరుతో జరిగిన అత్యాచారాలు కోకొల్లలు. అలాంటి అత్యాచారాలలో కొన్నింటిని మాత్రమే ఈ భాగంలో పొందుపరచడం జరిగింది. ప్రతి అత్యాచారానికి శీర్షిక కూడ ఉంచబడింది.

ప్రచురణ :
పశ్చిమగోదావరిజిల్లా హేతువాద సంఘం
పాలకొల్లు - 534 260

ముద్రణ : నాగార్జున ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్స్ - తెనాలి.

# బైబిలు దర్శిని

## 3. అత్యాచారాలు

### మాంసాహారుల్ని దేవుడే సృష్టించాడు

దేవుడు జీవము కలిగి చలించువాటినన్నిటిని .... ఆయాజాతుల ప్రకారము ఆయా జంతువులను, ఆయా జాతుల ప్రకారము పశువులను, ఆయా జాతుల ప్రకారము నేలను ప్రాకు ప్రతి పురుగును చేసెను....దేవుడు తాను చేసినదియావత్తును చూసినప్పుడు అది చాల మంచిదిగ నుండెను. ఆది 1:21,25,31.

(ఆది 2:19 కూడచూడండి.)

(సొరచేపలు, పాములు, పులులు, పరాన్నజీవులు, రోగాల్ని కలిగించే క్రిములు మొద లైనవన్నీదేవుడు ఉద్దేశ్యపూర్వకంగా చేసినవేనట: ఒక ప్రాణికి ఆహారంగా మరో ప్రాణిని ఏర్పాటు చెయ్యడమేకాక, ప్రజాసంహారం చేసే రకరకాల జంతువుల్ని, సూక్ష్మ జీవుల్నీ ఆ దేవుడే చేసి అవన్నీ "చాల మంచివిగ" వున్నట్లు ప్రకటించాడు. దేవుడి దృష్టిలో మంచి అయినది మానవుడి దృష్టిలో మంచికి చాల భిన్నంగావుంది.)

### ఒకడుచేసిన తప్పుకు దేవుడు మానవులందరికీ శిక్ష విధించాడు

ఒక మనుష్యుని పాపమును పాపము ద్వారా మరణమును లోకములో ఏలాగు ప్రవేశించెనో, ఆలాగుననే మనుష్యులందరు పాపము చేసినందున మరణము అందరి కిని సంప్రాప్తమాయెను. రోమీ 5:12.

మరణము ఒకని అపరాధ మూలమున వచ్చినదై... మనుష్యుల కందరికిని శిక్షావిధి కలుగుటకు .... కారణమాయెను, ఏలయనగా ఒక మనుష్యుని అవిధేయత వలన అనేకులు పాపులుగా....చేయబడుదురు. రోమీ 5:17-19.

మనుష్యుని ద్వారా మరణము వచ్చెను గనుక మనుష్యుని ద్వారానే మృతుల పునరుత్థానమును కలిగెను. ఆదామునందు అందరు ఏలాగు మృతి పొందుచున్నారో, ఆలాగుననే క్రీస్తునందు అందరు బ్రదికింపబడుదురు. 1 కొరిం 15:21, 22.

(మొట్టమొదటి మానవుడైన ఆదాము జ్ఞాన వృక్షఫలాన్ని తినేవరకు ఈ భూమిమీద మరణమనేదే లేదని క్రైస్తవం చెబుతుంది. మొదట సృష్టించబడ్డ సమస్త ప్రాణులు కూడ మరణానికి గురికావలసి రావడానికి కారణం మానవుడుతప్పుచెయ్యడమేనట [పరిణామంలో మానవుడు భూమ్మీద అవతరించకముందే పశుపక్ష్యాదులన్నీ మరణానికి గురికాబడ్డాయని భూగర్భశాస్త్ర పరిశోధనలవల్ల రుజువైంది. కాని నేడింకా క్రైస్తవమతం తప్పుడు సిద్ధాంతాలతో నిర్దయగా వ్యాపారపద్ధతిలో అసత్యాలను ప్రచారం చేస్తున్నది] పరిస్థితులఒత్తిడి వల్ల అజ్ఞాన వృక్షఫలాన్ని తిన్నా దేవుడు చాలక్రూరంగా పగతీర్చుకున్నాడు.

అ) ఆదాముకు ముందు హెచ్చరిక లేకుండానే మానవులు శాశ్వత బాధలు పొందేవిధంగా ఈ భయంకర శిక్షను దేవుడు విధించాడు.

ఆ) ఆ నేరం చేసేనాటికి ఆదాము తప్పు - ఒప్పు, మంచిచెడుల మధ్యభేదాన్ని తెలుసుకోలేని అమాయకుడు. అతడు చేసిన అతిస్వల్పమైన నేరం కారణంగా ప్రపంచానికంతటికి భయానకమైన శిక్ష విధించడం అన్యాయం.

ఇ) సర్పం చెప్పిందే నిజమైతే, ఫలాన్ని తిన్నవెంటనే చస్తావన్న దేవుడి బెదిరింపుఅసత్యమయి పోవాలి.

ఈ) మంచిచెడ్డల తెలివినిచ్చు జ్ఞానవృక్ష ఫలాన్ని కోయడం మంచిపనే కాని శిక్షార్హమయినది కాదు.

ఉ) భవిష్యద్విషయాలన్నీ తెలిసిన దేవుడు ఆదామును అధోగతి పాల్జేసే ఉచ్చులోకి ఉద్దేశ్యపూర్వకంగానే యుక్తితో లాగి ఏమీ ఎరుగనట్టు చోద్యం చూస్తూ కూర్చున్నాడు. ఆయన తనచేతి పనియైన ఆదామును అసంపూర్తిగాచేసి, అతనుచేసిన స్వల్పమైన నేరాన్ని కారణం చూపి జీవజాలాన్నంతటినీ శిక్షించాడంటే తన చేతిపనికి తనే అసంతృప్తి చెంది తనే శిక్ష విధించాడన్నమాట!)

## దేవుడు ఒక జాతిని లోప భూయిష్టంగా తయారుచేసి తత్కారణంగా అన్నిజాతులకు చెందిన సమస్థ ప్రాణుల్ని జలప్రళయం తెప్పించి చంపేశాడు !

నరుల చెడుతనము భూమిమీద గొప్పదని .... యెహోవాచూచి .... నేను సృజించిన నరులను నరులతోకూడ జంతువులను పురుగులను ఆకాశపక్ష్యాదులను భూమిమీద నుండకుండ తుడిచివేయుదును. ఆది 6 : 5,7

ఇదిగో నేనే జీవవాయువుగల సమస్త శరీరులను ఆకాశముక్రింద నుండకుండ నాశనము చేయుటకు భూమి మీదికి జలప్రవాహము రప్పించుచున్నాను. లోకమందున్న సమస్తమును చనిపోవును. ఆది 6 : 17

నరులతోకూడ పశువులను, పురుగులను; ఆకాశపక్షులను, నేలమీదనున్న జీవరాసులన్నియు తుడిచివేయబడెను. అవి భూమి మీద నుండకుండ తుడిచివేయ బడెను. ఆది 7 : 23

## తప్పు ఒకరిది, శిక్ష మరొకరిది !

నోవహు వ్యవసాయము చేయనారంభించి, ద్రాక్షతోట వేసెను. పిమ్మట ద్రాక్షారసము త్రాగి మత్తుడై తన గుడారములో వస్త్రహీనుడుగా నుండెను. అప్పుడు కనానుకు తండ్రియైన హాము తన తండ్రి వస్త్రహీనుడై యుండుట చూచి బయట నున్న తన యిద్దరు సహోదరులకు ఆ సంగతి తెలిపెను. .... అప్పుడు నోవహు.... కనాను శపింపబడినవాడై తన సహోదరులకు దాసానుదాసుడగును అనెను.

ఆది 9 : 20–25

(హాము తన తండ్రి చేసిన తప్పును సహోదరులకు తెలియజేయగా నిర్దోషియైన అతని కుమారుడు కనాను, ఆతని వారసులు శపించబడ్డారు. ఆఫ్రికను బానిసల వ్యాపారం కనానీయులు దైవికంగా శపించబడిన కారణంగానే జరుగుతున్నదని క్రైస్తవులవాదన.)

## నరబలి కోరిన దేవుడు

అయితే మనుష్యులలోగాని జంతువులలోగాని స్వాస్థ్యమైన పొలములలోగాని తనకు కలిగిన వాటన్నిటిలో దేనినైనను ఒకడు యెహోవాకు ప్రతిష్ఠించిన యెడల ప్రతిష్ఠించిన దానిని అమ్మకూడదు, విడిపింపను కూడదు, ప్రతిష్ఠించిన సమస్తము యెహోవాకు అతి పరిశుద్ధముగా ఉండును. మనుష్యులు ప్రతిష్ఠించువాటిలో దేనినైనను విడిపింపక హతము చేయవలెను. లేవీ 27 : 28.29.

[దేవుడు యెరికో నివాసులలో కొంతమందిని ప్రేమించి మరికొంత మందిని ద్వేషించాడు (యెహో 6:17) యిర్మీ 7:30,31 ఈ విషయాన్ని స్పష్టంచేస్తూ యూదులు తమ కుమారులను కుమార్తెలను అగ్నిలో దహించి యెహోవాకు సమర్పించే వారని తెలియజేస్తున్నది. యెహె 20:25 26; మీకా 6:7 కూడ చూడండి]

## ఇస్సాకును బలియిమ్మని అబ్రాహాముకు దేవుడి ఆజ్ఞ

అప్పుడాయన – నీకు ఒక్కడైయున్న నీకుమారుని, అనగా నీవు ప్రేమించు

ఇస్సాకును తీసికొని మోరీయా దేశమునకు వెళ్ళి అక్కడ నేను నీతో చెప్పబోవు పర్వతములలో ఒకదాని మీద దహనబలిగా అతని నర్పించమని చెప్పెను.....అలాగు వారిద్దరుకూడివెళ్ళి దేవుడు అతనితో చెప్పిన చోటికి వచ్చినప్పుడు అబ్రహాము అక్కడ బలిపీఠమునుకట్టి కట్టెలు చక్కగా పేర్చి తన కుమారుడగు ఇస్సాకును బంధించి పీఠముపై నున్న కట్టెల మీద ఉంచెను. అప్పుడు అబ్రహాము తన కుమారుని వధించుటకు తన చెయ్యిచాపి కత్తి పట్టుకొనెను. ఆది 22:2,9,10.

## యెఫ్తా దహనబలి

యెహోవా ఆత్మ యెఫ్తా మీదికిరాగా....యెఫ్తా యెహోవాకు మ్రొక్కుకొనెను ఎట్లనగా–నీవు నాచేతికి అమ్మోనీయులను నిశ్చయముగా అప్పగించిన యెడల నేను అమ్మోనీయుల యొద్దనుండి క్షేమముగా తిరిగి వచ్చునప్పుడు, నన్ను ఎదుర్కొనుటకు నాయింటి ద్వారము నుండి బయలుదేరి వచ్చినదేదో అది యెహోవాకు ప్రతిష్ఠితమగును. మరియు దహనబలిగా దాని నర్పించెదను. న్యాయా 11:29–31.

యెఫ్తా మిస్పాలో నున్న తన యింటికి వచ్చినప్పుడు అతని కుమార్తె తంబురలతోను నాట్యముతోను బయలుదేరి అతనిని ఎదుర్కొనెను. ఆమెగాక అతనికి మగ సంతానమేగాని ఆడ సంతానమేగాని లేదు....ఆ రెండు నెలల అంతమున ఆమె తన తండ్రియొద్దకు తిరిగిరాగా అతడు తాను మ్రొక్కుకొనిన మ్రొక్కుబడి చొప్పున ఆమెకు చేసెను. న్యాయా 11:34,39.

(తన ప్రియమైన ఏకైక కుమార్తె ముందుగా తనను కలుసుకుంటుందని యెఫ్తా అనుకుని వుండవలసింది. ప్రభువు ప్రోత్సాహంతో వరంకోరి తగిన బలి ఇచ్చాడు. అయితే ఆధునిక క్రైస్తవులు యెఫ్తాకుమార్తె శాశ్వతంగా కన్యగా వుంచబడిందని వ్యాఖ్యానిస్తారు. ఇది పొరపాటని, ఆ బాలిక దహించబడిందని యూదుచరిత్రకారుడు జోసెఫస్అంటాడు

## దేవుడికోరిక ప్రకారం ఏడుగురి నిర్దోషుల బలి

దావీదు కాలమున మూడు సంవత్సరములు విడువకుండ కరువు కలుగగా దావీదు యెహోవాతో మనవి చేసెను. అందుకు యెహోవా ఈలాగున సెలవిచ్చెను- సౌలు గిబియోనీయులను హతము చేసెను గనుక అతనిని బట్టియు, నరహంతకులగు అతని యింటివారిని బట్టియు శిక్షగా ఈ కరువు కలిగెను....మాకు హాని చేయ నుద్దేశించిన వాని కుమారులలో ఏడుగురిని మాకప్పగించుము యెహోవా ఏర్పరచుకొనిన సౌలుగిబియా పట్టణములో యెహోవా సన్నిధిని మేమువారిని ఉరితీసెదమని

రాజుతో మనవి చేయగా రాజు–నేను వారిని అప్పగించెదననెను....వారు (గిబియోనీయులు) ఈయేడుగురినీ తీసుకొనిపోయి కొండమీద యెహోవా సన్నిధిని ఉరి తీసిరి....ఈలాగు చేసిన తరువాత దేశము కొరకు చేయబడిన విజ్ఞాపనమును దేవు డంగీకరించెను. 2 సమూ 21:1,5,6,9,14.(సంఖ్యా 25:4తో పోల్చి చూడండి)

## అల్లరిమూకకు కూతుళ్ళను అప్పగించబోయిన లోతు !

ఇదిగో పురుషునికూడని యిద్దరు కుమార్తెలు నాకున్నారు. సెలవైతే వారిని మీ యొద్దకు వెలుపలికి తీసికొనివచ్చెదను. నన్ను వచ్చినట్లు చేయుడి.
ఆది 19:8.

## ఆయావంశాల మూలపురుషులుగా దేవునిచే ఎంపిక చేయబడ్డ యాకోబు కుమారులు షెకెమీయులనందరినీ చంపి వాళ్ల భార్యలను ఎత్తుకుపోయారు !

హమోరువారితో–షెకెము అను నాకుమారుని మనస్సు మీ కుమార్తె మీదనే ఉన్నది; దయచేసి ఆమెను అతనికిచ్చి పెండ్లి చేయుడి....అయితే తమ సహోదరియైన దీనాను అతడు చెరిపినందున యాకోబు కుమారులు షెకెముతోను అతని తండ్రియైన హమోరుతోను కపటముగా ఉత్తరమిచ్చి అనినదేమనగా–మేము ఈ కార్యము చేయలేము, సున్నతి చేయించుకొనని వారికి మా సహోదరిని ఇయ్యలేము, అదిమాకు అవమానమగును. మీలో ప్రతి పురుషుడు సున్నతిపొంది మావలె నుండినయెడల సరి; ఆ పక్షమందు మీమాట కొప్పుకొని, మా పిల్లలను మీ కిచ్చి మీ పిల్లలను మేము పుచ్చుకొని మీ మధ్య నివసించెదము....ఆ చిన్నవాడు యాకోబు కుమార్తెయందు ప్రీతి గలవాడు గనుక అతడు ఆ కార్యము చేయుటకు తడవు చేయలేదు. అతడు తన తండ్రి యింటి వారందరిలో ఘనుడు....వారిలో ప్రతి పురుషుడు సున్నతి పొందెను. మూడవ దినమున వారు బాధపడుచుండగా యాకోబు కుమారులలో నిద్దరు, అనగా దీనా సహోదరులైన షిమ్యోనును లేవీయు, తమ కత్తులు చేత పట్టుకొని ఎవరికీ తెలియకుండ ఆ ఊరి మీదపడి ప్రతి పురుషుని చంపిరి, వారు హమోరును అతని కుమారుడైన షెకెమును కత్తివాత చంపి.... వారి ధనము యావత్తును తీసికొని, వారి పిల్లలనందరిని వారి స్త్రీలను చెరపట్టి, యిండ్లలో నున్నదంతయు దోచుకొనిరి. ఆది 34:8-29.

యెహోవా ఐగుప్తీయులను ఘోరమైన కష్టాలకు గురిచేయాలనే ఉద్దేశ్యంతో కావాలనే ఫరోరాజు హృదయాన్ని కఠినపరచాడు!

అయితే నేను ఫరోహృదయమును కఠినపరచి, ఐగుప్తు దేశములో నా సూచక క్రియలను నా మహత్కార్యములను విస్తరింపజేసెదను. ఫరో మీ మాట వినడుగాని నేను నా చెయ్యి ఐగుప్తు మీద వేసి గొప్ప తీర్పులచేత నా సేనలను ఇశ్రాయేలీయులైన నా ప్రజలను ఐగుప్తుదేశములో నుండి వెలుపలికి రప్పించెదను .... యెహోవా చెప్పినట్టు ఫరో హృదయము కఠినమాయెను గనుక అతడు వారిమాట వినకపోయెను. నిర్గ 7:3,4,13

నేను చేయు సూచక క్రియలను ఐగుప్తీయుల ఎదుట కనబరచుటకు .... నేను అతని హృదయమును అతని సేవకుల హృదయములను కఠినపరచితినవెను. నిర్గ 0 : 1,2

(నిర్గ 10 : 20,27 కూడ చూడండి)

ఇదిగో నేను ఐగుప్తీయుల హృదయములను కఠిన పరచుదును. వారు వీరిని తరుముదురు. నేను ఫరోవలనను అతని సమస్త సేనవలనను అతని రథముల వలనను అతని గుఱ్ఱపు రౌతులవలనను నాకు మహిమ తెచ్చుకుందును. నిర్గ 14 : 17

## నీరంతా రక్తంగా మార్చబడింది

యెహోవా ఆజ్ఞాపించినట్లు మోషే అహరోనులు చేసిరి. అతడు ఫరో యెదుటను అతని సేవకుల యెదుటను తన కఱ్ఱను పైకెత్తి ఏటి నీళ్లను కొట్టగా ఏటి నీళ్లన్నియు రక్తముగా మార్చబడెను. ఏటిలోని చేపలు చచ్చెను, ఏరు కంపు కొట్టెను, ఐగుప్తీయులు ఏటినీళ్ళు త్రాగలేక పోయిరి. ఐగుప్తుదేశమందంతట రక్తము ఉండెను. నిర్గ 7 : 20,21

విస్తారంగా కప్పలను, పేలను, ఈగలను పంపించి ఐగుప్తీయులను బాధించిన తరువాత దేవుడు తెగులు పుట్టించి వారి పశువులనన్నిటినీ కూడ చంపించాడు ! (నిర్గ 8వ అధ్యాయం చూడండి)

ఇదిగో యెహోవా బాహుబలము పొలములోనున్న నీపశువుల మీదికిని నీ

గుఱ్ఱములమీదికిని గాడిదల మీదికిని ఒంటెల మీదికిని ఎద్దుల మీదికిని గొఱ్ఱెలమీదికిని వచ్చును, మిక్కిలి బాధకరమైన తెగులు కలుగును .... యెహోవా ఆ కార్యము చేయగా ఐగుప్తీయుల పశువులన్నియు చచ్చెను. నిర్గ 9 : 3,6.

## వడగండ్లతో మనుష్యులను, జంతువులను చంపడం !

పొలములో వుండు ప్రతి మనుష్యుని మీదను జంతువుమీదను వడగండ్లు కురియును, అప్పుడు అవి చచ్చునని చెప్పుమనెను .. యెహోవా ఉరుములను వడగండ్లను కలుగ జేయగా పిడుగులు భూమిమీద పడుచుండెను .... ఆ వడగండ్లు ఐగుప్తు దేశమందంతట మనుష్యులనేమి జంతువులనేమి బయటనున్నది యావత్తును నశింప చేసెను. నిర్గ 9 : 19 23,25

## దేవుడు అర్థరాత్రివేళ ఐగుప్తీయులందరి యింట ప్రవేశించి వారందరి తొలి సంతానాన్ని హత్య చేశాడు !

అర్థరాత్రివేళ జరిగినదేమనగా, సింహాసనము మీద కూర్చున్న ఫరో మొదలుకొని చెరసాలలో నున్న ఖైదీయొక్క తొలిపిల్ల వరకు ఐగుప్తుదేశమందలితొలి పిల్లలనందరిని పశువుల తొలి పిల్లలనన్నిటిని యెహోవా హతము చేసెను. ఆ రాత్రి ఫరోయు అతని సేవకులందరును ఐగుప్తీయులందరును లేచినప్పుడు శవము లేని ఇల్లు ఒకటైనను లేక పోయినందున ఐగుప్తులో మహా ఘోషపుట్టెను.

నిర్గ 12:29,30. (నిర్గ 11:4 6 కూడ చూడండి)

## ఐగుప్తీయులను హతమార్చి ప్రతిష్టపెంచుకున్న దేవుడు !

అయితే నేను ఫరో హృదయమును కఠిన పరచెదను; అతడు వారిని తరుమగా; నేను ఫరోవలనను అతని సమస్తసేన వలనను మహిమ తెచ్చుకొందును.

నిర్గ 14:4.

వేకువజామున యెహోవా ఆ అగ్నిమేఘమయమైన స్తంభమునుండి ఐగుప్తీయుల దండువైపు చూచి ఐగుప్తీయులదండును కలవరపరచి వారి రథచక్రములు ఊడిపడునట్లు చేయగా వారు బహుకష్టపడి తోలుచుండిరి....అప్పుడు యెహోవా సముద్రము మధ్యను ఐగుప్తీయులను నాశము చేసెను నీళ్లుతిరిగి వచ్చి ఆ రథములను రౌతులను వారి వెనుక సముద్రములోనికి వచ్చిన ఫరోయొక్క సర్వసేనను కప్పివేసెను; వారిలో ఒక్కడైనను మిగిలి యుండలేదు. నిర్గ 14:24-28.

నేను ఫరో వలనను అతని రథములవలనను ఆతని గుఱ్ఱపురౌతుల వలనను మహిమ తెచ్చుకొందును. నిర్గ 14 : 18

## బానిసత్వానికి దేవుడి కితాబు

నీవు హెబ్రీయుడైన దాసుని కొనిన యెడల .... వాని యజమానుడు వానికి భార్యనిచ్చిన తరువాత ఆమె వానివలన కుమారులనైనను కుమార్తెనైనను కనినయెడల ఆ భార్యయు ఆ పిల్లలును ఆమె యజమానుని సొత్తగుదురు కాని వాడు ఒంటిగానే పోవలెను. అయితే ఆ దాసుడు నేను నా యజమానుని నా భార్యను పిల్లలను ప్రేమించు చున్నాను, నేను వారిని విడిచి స్వతంత్రుడనై పోనొల్లనని నిజముగా చెప్పిన యెడల వాని యజమానుడు దేవుని (న్యాయాధిపతి) యొద్దకు వాని తీసికొని రావలెను, మరియు వానియజమానుడు తలుపు నొద్దకైనను ద్వారబంధమునొద్దకైనను వాని తోడుకొనిపోయి వాని చెవిని కదురుతో గుచ్చవలెను. తరువాత వాడు నిరంతరము వానికి దాసుడై యుండును. నిర్గ 21 : 2-6

మీ చుట్టుపట్లనున్న జనములలోనుండి దాసీలను కొనవచ్చును. మరియు మీమధ్య నివసించు పరదేశులను నీదేశములో వారికి పుట్టిన వారిని కొనవచ్చును. వారు మీ సొత్తగుదురు, మీ తరువాత మీ సంతతివారికి స్వాస్థ్యముగా వుండునట్లు మీరు ఇట్టివారిని స్వతంత్రించుకొన వచ్చును. వారుశాశ్వతముగా మీకు దాసులగుదురు.
లేవీ 25 : 44-46

## కుమార్తెను అమ్ముకోవచ్చు

ఒకడు తన కుమార్తెను దాసిగా అమ్మినయెడల దాసులైన పురుషులు వెళ్లిపోవునట్లు అది వెళ్లిపోకూడదు. నిర్గ 21:7.

## బానిసలను పట్టుకోవటానికి దండయాత్రలు

యుద్ధము చేయుటకు మీరొక పురము మీదికి సమీపించునప్పుడు సమాధానము నిమిత్తము రాయబారమును పంపవలెను. సమాధానమని అది నీకు ఉత్తరమిచ్చి గుమ్మములను తెరచిన యెడల దానిలోనున్న జనులందరు నీకు పన్ను చెల్లించి నీ దాసులగుదురు. అది మీతో సమాధాన పడక యుద్ధమే మంచిదని యెంచిన యెడల దాని ముట్టడివేయుడి. నీ దేవుడైన యెహోవా దాని నీచేతి కప్ప

గించునప్పుడు దానిలోని మగవారినందరిని కత్తివాత హతము చేయవలెను. అయితే స్త్రీలను చిన్నవారిని పశువులను ఆ పురములోనున్నది యావత్తును దానికొల్ల సొమ్ముంతటిని నీవు తీసికొనవచ్చును....ఈ జనముల పురములుగాక నీకు బహుదూరముగా ఉండిన సమస్తపురములకు మాత్రమే ఈలాగున చేయవలెను. ద్వితీ 20;10-15.

## స్త్రీలను చెరపట్టి పెండ్లిచేసుకోవచ్చు

నీవు నీ శత్రువులతో యుద్ధము చేయబోవునప్పుడు నీ దేవుడైన యెహోవా నీ చేతికి వారిని అప్పగించిన తరువాత వారిని చెరపట్టి ఆ చెరపట్టబడినవారిలో రూపవతియైన దానిని చూచి ఆమెను మోహించి ఆమెను పెండ్లి చేసికొన మనస్సయి.... నీవు ఆమెయొద్దకు పోయి ఆమెను పెండ్లిచేసికొనవచ్చును. ఆమె నీకు భార్యయగును. నీవు ఆమె వలన సంతుష్టినొందని యెడల ఆమె మనస్సు వచ్చిన చోటికి ఆమెను సాగనంపవలెను. ద్వితీ 21:10-14.

(సంఖ్యా 31:18, 35; ద్వితీ 24:1-3 కూడ చూడండి.)

(దేవుడు ఉపదేశించిన ఈ వాక్యాల్లోఎక్కడా స్త్రీయొక్క సమ్మతిని పొందమనికోరలేదు)

## వెంటనే ప్రాణం పోయేట్టుగాక ఒకటి రెండురోజుల్లో ప్రాణం పోయేట్టు దాసినైనా, దాసుడినైనా యజమానికొడితే తప్పు లేదు !

ఒకడు తన దాసుడైనను తన దాసియైనను చచ్చునట్లు కఱ్ఱతో కొట్టిన యెడల....వాడు ఒకటి రెండు దినములు బ్రదికినయెడల ఆ ప్రతిదండన అతడు పొందడు, వాడు అతని సొమ్మేగదా. నిర్గ 21:20,21.

## సోదెచెప్పే వాళ్లను చంపాలి

శకునము చెప్పుదానిని బ్రదుకనియ్యకూడదు. నిర్గ 22:18.

పురుషుని యందేమి స్త్రీయందేమి కర్ణపిశాచియైనను సోదెయైనను ఉండిన యెడల వారికి మరణశిక్ష విధింపవలెను. వారిని రాళ్లతో కొట్టవలెను. తమ శిక్షకు తామే కారకులు. లేవీ 20:27.

(ద్వితీ 18:10,11;గలతీ 5:20 కూడ చూడండి)

(శకునమనేది శాస్త్రబద్ధం కాని దోషభూయిష్టమైన ఊహాజనిత విషయం అయినా ఈబైబిలు బోధనల మూలంగా వేలాదిమంది అమాయక స్త్రీలను చంపడం జరిగింది).

## మంత్ర విద్యలున్న వాళ్లతో సంబంధాలు పెట్టుకుంటే చావుతప్పదు!

కర్ణపిశాచిగలవారితోను సోదెగాండ్రతోను .... తిరుగువాడెవడో నేనువానికి విరోధినై ప్రజలలో నుండి కొట్టివేతును. లేవీ 20:6.

## అన్యదేవతారాధకులకు మరణశిక్ష

యెహోవాకు మాత్రమేగాక వేరొక దేవునికి బలి అర్పించువాడు శాపగ్రస్తుడు. నిర్గ 22:20.

ప్రవక్తయేగాని కలలునుకను వాడేగాని నీ మధ్యలేచి నీయెదుట సూచక క్రియ నైనను మహత్కార్యమునైనను చేసి నీవు ఎరుగని యితర దేవతలను అనుసరించి పూజింతము రమ్మని చెప్పినయెడల....ఆ ప్రవక్తకేమి ఆ కలలుకను వానికేమి మరణ శిక్ష విధింపవలెను. ద్వితీ 31:1,2,5.

అది నిజమైన యెడల, అనగా అట్టిహేయమైనది (ఇతర దేవతలను పూజించుట) నీ మధ్య జరిగిన యెడల ఆ పురనివాసులను ఆవశ్యముగా కత్తివాత సంహరించి, దానిని దానిలోనున్న సమస్తమును దాని పశువులను కత్తివాత నిర్మూలము చేయవలెను. ద్వితీ 13:14,15.

అన్యదేవతలకు; అనగా సూర్యునికైనను చంద్రునికైనను ఆకాశ నక్షత్రములలో దేనికైనను నమస్కరించి మ్రొక్కు పురుషుడేగాని స్త్రీయేగాని....నీ మధ్య కనబడినప్పుడు....ఆ చెడ్డకార్యము చేసిన పురుషునిగాని స్త్రీనిగాని గ్రామముల వెలుపలికి తీసికొనిపోయి రాళ్లతో చావగొట్టవలెను. ద్వితీ 17:2-5.

ఏ ప్రవక్తయు అహంకారము పూని, నేను చెప్పుమని తన కాజ్ఞాపించని మాటను నా నామమున చెప్పునో, యితర దేవతల నామమున చెప్పునో ఆ ప్రవక్తయును చావలెను. ద్వితీ 18:20.

## మతంతో విభేదిస్తే తండ్రి సొంతకూతుర్ని, భార్యను, కుమారుడిని లేక మిత్రుడిని చంపవచ్చు

నీ తల్లి కుమారుడేగాని నీ సహోదరుడేగాని నీ కుమార్తెయేగాని నీ కౌగిట భార్యయేగాని నీ ప్రాణ స్నేహితుడేగాని....యితర దేవతలను పూజింతము రమ్మని

రహస్యముగా నిన్ను ప్రేరేపించినయెడల వారిమాటకు సమ్మతింపకూడదు; వారి యందు జాలిపడకూడదు. వారిని మాటు పరచకూడదు; అవశ్యముగా, వారిని చంప వలెను. చంపుటకు నీ జనులందరికి ముందుగాను నీ చెయ్యి మొదట వారి మీద పడవలెను. రాళ్లతో వారి చావ గొట్టవలెను. ద్వితీ 13:6-10.

## తృణీకారానికి మరణశిక్ష

అయితే దేశమందు పుట్టినవాడేగాని పరదేశియేగాని యెవడైనను సాహసించి పాపము చేసిన యెడల వాడు యెహోవాను తృణీకరించిన వాడగును గనుక అట్టి వాడు నిశ్చయముగా జనులలో నుండకుండ కొట్టివేయబడును. సంఖ్యా 15:30,31

మరియు నెవడైనను మూర్ఖించి అక్కడ నీ దేవుడైన యెహోవాకు పరిచర్య చేయుటకు నిలుచు యాజకుని మాటనేగాని ఆ న్యాయాధిపతి మాటనేగాని విననొల్లని యెడల వాడు చావవలెను. ద్వితీ 17 : 12

(మోసంచేసే ఉద్దేశ్యంతోగాని, సరైన జ్ఞానంలేక గాని నేడుకొందరు క్రైస్తవులు "కొట్టి వేయబడును" అంటే "చంపివేయబడును" అనిఅర్థం కాదంటున్నారు. రెండింటినీఒకే అర్థంతో వాడినట్లు నిర్గ 31:14,15 మరియు లేవీ 18:29 లలో చూడవచ్చు. వీపు వాది స్తున్నట్లు వేరే అర్థంలో వాడబడినచోట శైలిలో తేడావున్నది. అందుకుగాను సంఖ్యా 5:2,4; 12:14,15 మరియు ద్వితీ 23:1-3 లను కూడ పరిశీలించి తేడా గమనించండి)

## విశ్రాంతి దినం ఆచరించని వాళ్లకు మరణం తప్పదు !

కావున మీరు విశ్రాంతి దినము నాచరింప వలెను. నిశ్చయముగా అది మీకు పరిశుద్ధము: దానిని అపవిత్రపరచు వాడు తన ప్రజలలోనుండి కొట్టివేయబడును ఆరుదినములు పనిచేయవచ్చును, యేడవ దినము యెహోవాకు ప్రతిష్ఠితమైన విశ్రాంతి దినము. ఆ విశ్రాంతి దినమున పనిచేయు ప్రతివాడును తప్పక మరణ శిక్ష నొందును. నిర్గ 31:14,15

## ఏడవదినమున యింటిలో పొయ్యి వెలిగించినా మరణం ఖాయం !

దానిలోపనిచేయు ప్రతివాడును మరణశిక్ష నొందును. విశ్రాంతి దినమున మీరు మీ యిండ్లలో ఎక్కడను అగ్ని రాజబెట్టకూడదని వారితో చెప్పెను.

నిర్గ 35 : 2, 3

దానిని అపవిత్ర పరచువాడు తన ప్రజలలోనుండి కొట్టివేయబడును.
నిర్గ 31 : 14

## శనివారం కట్టెలు ఏరుకొన్న వ్యక్తిని నిర్దాక్షిణ్యంగా చంపారు !

ఇశ్రాయేలీయులు అరణ్యములో ఉన్నప్పుడు ఒకడు విశ్రాంతి దినమున కట్టెలు ఏరుట చూచిరి .... యెహోవా - ఆ మనుష్యుడు మరణశిక్ష నొందవలెను. సర్వసమాజము పాళెము వెలుపల రాళ్ళతో వాని కొట్టి చంపవలెనని మోషేతో చెప్పెను. కాబట్టి యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు సర్వసమాజము పాళెము వెలుపలికి వాని తీసికొనిపోయి రాళ్ళతో వాని చావగొట్టెను. సంఖ్యా 15 : 32-36

(పవిత్ర దినమైన ఏడవరోజున పనిచేయుచున్నవారిని, యింటనిప్పు రాజబెట్టుచున్నవారిని రాళ్ళతోకొట్టి చంపకుండ క్రైస్తవసమాజాలు దేవుడి ఆజ్ఞను ధిక్కరిస్తున్నాయి. క్రైస్తవ వేదమైన బైబిలు దేవుడు తనసృష్టి కార్యక్రమాన్ని ఆదివారం ప్రారంభించి శనివారం విశ్రాంతి తీసుకున్న కారణంగా దాన్ని పవిత్రపరచిన విషయం క్రైస్తవులే అలక్ష్యం చేస్తున్నారు.)

## పస్కా పండుగను ఆచరింపని వ్యక్తులకు కూడ మరణదండనే శిక్ష !

ప్రయాణములోవుండని పవిత్రుడు పస్కాను ఆచరించుటమానినయెడల ఆ మనుష్యుడు తన జనులలో నుండి కొట్టివేయబడును. అతడు యెహోవా అర్పణ మును దాని నియామక కాలమున అర్పింపలేదు గనుక ఆ మనుష్యుడు తన పాప మును తానే భరింపవలెను. సంఖ్యా 9:13.

## పస్కా పండుగరోజుల్లో పులిసినరొట్టె తిన్నవాడికి చావు తప్పదు !

మొదటిదినము మొదలుకొని యేడవదినము వరకు పులిసిన దానిని తిను ప్రతి మనుష్యుడు ఇశ్రాయేలీయులలో నుండి కొట్టి వేయబడును. నిర్గ 12:15.

ఏడుదినములు మీయిండ్లలోపొంగిన దేదియును ఉండకూడదు, పులిసినదానిని తినువాడు అన్యుడేగాని దేశములో పుట్టిన వాడేగాని ఇశ్రాయేలీయుల సమాజములో నుండక కొట్టివేయబడును. నిర్గ 12:19.

## క్రొవ్వునుతింటే మరణశిక్ష

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను-నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము-యెద్దుదేగాని గొఱ్ఱెదేగాని మేకదేగాని క్రొవ్వును మీరు తినకూడదు.... ఏలయనగా మనుష్యులు యెహోవాకు హోమముగా అర్పించు జంతువులలో దేని క్రొవ్వునైనను తినినవాడు తన ప్రజలలోనుండి కొట్టివేయబడును.

లేవీ 7:22-25.

## రక్తంతింటే మరణశిక్ష

క్రొవ్వంతయు యెహోవాదే; అది సువాసనగల హోమరూపమైన ఆహారము. మీరు క్రొవ్వునైనను రక్తమునైనను తినకూడదు. లేవీ 3:16,17.

పక్షిదేగాని, జంతువుదేగాని యే రక్తమును మీ నివాసములన్నిటిలో తినకూడదు. ఎవడు రక్తముతినునో వాడు తన ప్రజలలోనుండి కొట్టివేయబడును.

లేవీ 7:26,27.

(పరాయి దేశస్థుడైనారక్తంతో కూడిన వంట తింటె అతడు చేసిన పాపానికిగాను మరణ శిక్ష విధించాలి. లేవీ 17:10-16 చూడండి.)

## సున్నతిపొందని వాళ్లకు మరణశిక్ష

సున్నతిపొందని మగవాడు, అనగా ఎవని గోప్యాంగ చర్మమున సున్నతి చేయబడదో అట్టివాడు తన జనులలోనుండి కొట్టివేయబడును. వాడు నా నిబంధనను మీరి యున్నాడు. ఆది 17:14.

## మోషేతో చెప్పిన పవిత్ర తైలాన్ని ఎవరైనా తయారుచేసినా దాన్ని ఎవరి మీదనైనా పోసినా వాళ్లను చంపుతానన్న దేవుడు

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను-నీవు ముఖ్యమైన సుగంధ సంభారములలో పరిశుద్ధ సంబంధమైన....వాటిని ప్రతిష్ఠాభిషేక తైలము అనగా సుగంధ ద్రవ్యమేళకుని పనియైన పరిమళ సంభారముగా చేయవలెను. అది ప్రతిషాభిషేక తైలమగును....దాని వంటిది కలుపువాడునుఅన్యుని మీదదానిని పోయువాడును తన ప్రజలలో నుండి కొట్టివేయబడును. నిర్గ 30:22-25,33.

పరిమళద్రవ్యాన్ని తయారుచేసినా దేవుడు మరణం కలుగ జేస్తాడు.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను-నీవు పరిమళ ద్రవ్యములను, అనగా జటామాంసి గోపిచందనము గంధపుచెక్క అను ఈ పరిమళ ద్రవ్యములను స్వచ్ఛమైన సాంబ్రాణిని సమభాగములుగా తీసికొని వాటితో ధూపద్రవ్యమును చేయవలెను. అది సుగంధ ద్రవ్యమేళకుని పనిచొప్పున కలపబడి, ఉప్పుగలదియు స్వచ్ఛమైనదియు పరిశుద్ధమైనదియునైన సుగంధధూపసంభారము....దాని వాసనచూచుటకు దాని వంటిది చేయువాడు తన ప్రజలలో నుండి కొట్టివేయబడును.

నిర్గ 30 : 34 - 38

## బలి యిచ్చిన మాంసం ఆలస్యంగా తింటే శిక్ష మరణం !

మీరు యెహోవాకు సమాధానబలి అర్పించునప్పుడు....మీరు బలినర్పించు నాడైనను మరునాడైనను దాని తినవలెను....మూడవనాడు దానిలో కొంచెమైనను తినినయెడల అది హేయమగును... దానినితినువాడు తన దోషశిక్షను భరించును. వాడు యెహోవాకు పరిశుద్ధమైన దానిని అపవిత్ర పరచెను. వాడు ప్రజలలో నుండి కొట్టివేయబడును. లేవీ 19:5–8. (లేవీ 7:15-18 కూడ చూడండి.)

## యాజకుడి సహాయం పొందకుండా బలి అర్పిస్తే మరణ శిక్ష

ఇశ్రాయేలీయుల కుటుంబములోగాని మీలో నివసించు పరదేశులలోగాని ఒకడు దహనబలినైనను వేరొక యే బలినైనను యెహోవాకు అర్పింప నుద్దేశము గలవాడై ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారము నొద్దకు తీసికొని రానియెడల ఆ మనుష్యుడు జనులలోనుండి కొట్టివేయబడును. లేవీ 17:8,9.

## యాజకుడి యొద్దకు తీసుకురాకుండా పశువులను వధించినా మరణమే శిక్ష

ఇది యెహోవా ఆజ్ఞాపించిన మాట. ఇశ్రాయేలీయుల కుటుంబములలో యెహోవా మందిరముయెదుట యెహోవాకు అర్పణము అర్పించుటకు పూనుకొనువాడు, అది ఎద్దేగాని గొఱ్ఱెయేగాని మేకయేగాని ప్రత్యక్షపు గుడారము యొక్క

ద్వారమునొద్దకు దానిని ముందు తేక పాళెములో వధించినను పాళెమునకు వెలుపల వధించినను ఆ మనుష్యుడు తన ప్రజలలోనుండి కొట్టివేయబడును. వాడు రక్తమును ఒలికించినవాడు ఇశ్రాయేలీయులు .... బలిపశువులను ఇక బయట వధింపక యెహోవా పేరట యాజకుని యొద్దకు .. తీసికొనివచ్చి సమాధానాబలిగా అర్పించునట్లు ఆ మనుష్యుడు జనులలో నుండి కొట్టివేయబడవలెను. లేవీ 17:2-5.

## తగు ప్రాయశ్చిత్తం పొందకుండ బలిపశువు మాంసం తినడం మరణపాత్రమైన నేరం !

ఒకడు తనకు అపవిత్రత కలిగియుండగా యెహోవాకు అర్పించు సమాధాన బలి పశువు మాంసములో కొంచెమైనను తినినయెడల వాడు ప్రజలలో నుండి కొట్టివేయబడును. ఎవడు మనుష్యుల అపవిత్రతనేగాని అపవిత్రమైన జంతువునేగాని యేఅపవిత్రమైన వస్తువునేగాని తాకి యెహోవాకు అర్పించు సమాధాన బలి పశువు మాంసమును తినునో వాడు ప్రజలలో నుండి కొట్టివేయబడును. లేవి 7:20,21.

(లేవీ 22:3,9; సంఖ్యా 19:13 కూడ చూడండి)

(ఒక పందిని ముట్టుకున్న తరువాతగాని నరశవమును ముట్టుకున్న తరువాతగాని సమాధాన బలిపశువు మాంసంతింటే మరణశిక్ష)

## పరిశుద్ధమైన వాటిని ముట్టుకుంటే మరణశిక్ష

పరిశుద్ధ స్థలముయొక్క ఉపకరణములన్నిటిని కప్పుట ముగించిన తరువాత కహాతీయు దానిమోయ రావలెను. అయితే వారు చావక యుండునట్లు పరిశుద్ధమైన దానిని ముట్టకూడదు. సంఖ్యా 4:15. (2 సమూ 6:6,7 కూడ చూడండి)

## బలిపీఠాన్ని సమీపిస్తే మరణ శిక్ష

వారు నిన్నును గుడార మంతటిని కాపాడుచుండవలెను. అయితే వారును మీరును చావకుండునట్లు వారి పరిశుద్ధ స్థలముయొక్క ఉపకరణముల యొద్దకైనను బలిపీఠము నొద్దకైనను సమీపింపవలదు. సంఖ్యా 18:3.

## పరిశుద్ధ స్థలాన్ని చూస్తే మరణం

వారు చావక యుండునట్లు పరిశుద్ధ స్థలమును రెప్పపాటు సేపయినను చూచుటకు లోపలికి రాకూడదు. సంఖ్యా 4 : 20.

## హెచ్చరిక లేకుండ దైవదర్శనం చేస్తే మరణం

ఒక్కొక్క బంగారు గంటయు దానిమ్మపండును ఆ నిలువుటంగీ క్రింద అంచున చుట్టు ఉండవలెను. సేవ చేయునప్పుడు అహరోను దాని ధరించు కొన వలెను. అతడు యెహోవా సన్నిధిని పరిశుద్ధ స్థలములోనికి ప్రవేశించునప్పుడుఅతడు చావక యుండునట్లు దాని ధ్వని వినబడవలెను. నిర్గ 28:34,35.

## నారబట్టలు లేకుండ పరిశుద్ధ స్థలములోనికి ప్రవేశిస్తే మరణం

వారి మానమును కప్పుకొనుటకు నీవువారికి నారలాగులను కుట్టవలెను. వారు ప్రత్యక్షపు గుడారములోనికి ప్రవేశించునప్పుడైనను, పరిశుద్ధ స్థలములో సేవ చేయు టకు సమీపించునప్పుడైనను, వారు దోషులై చావకయుండునట్లు అది అహరోను మీదను అతని కుమారుల మీదను ఉండవలెను. ఇది అతనికిని అతని తరువాత అతని సంతతికిని నిత్యమైన కట్టడ. నిర్గ 28:42,43.

## అపరిశుద్ధుడికి మరణం

ఒకడు ఏ అపవిత్ర వస్తువునైనను ముట్టిన యెడల, అది అపవిత్ర మృగ కళేబరమేగాని అపవిత్రమైన ప్రాకెడు జంతువు కళేబరమేగాని అది అపవిత్రమని తనకు తెలియకపోయినను అతడు అపవిత్రుడై అపరాధియగును. అపవిత్రుడు పాప శుద్ధి చేసికొనని యెడల అట్టి మనుష్యుడు సమాజములో నుండి కొట్టివేయబడును.
సంఖ్యా 19;20, (లేవీ 22:3,9 కూడ చూడండి)

నర శవమును ముట్టినవాడు అట్లు పాపశుద్ధి చేసుకొనని యెడల వాడు యెహోవా మందిరమును అపవిత్ర పరచు వాడగును. ఆ మనుష్యుడు ఇశ్రాయేలీయు లలో నుండి కొట్టివేయబడును. పాప పరిహార జలము వాని మీద ప్రోక్షింపబడలేదు.
సంఖ్యా 19 : 13,

(అపవిత్రత అనేది చాలమట్టుకు కల్పిత భావం. ఆచార ప్రకారం అప్పటికే అపవిత్రు లైన వారిని తాకినా [లేవీ 11:24, 27] లేదా చచ్చిపోయిన ఏ జంతుకళేబరాన్ని ముట్టు కున్నా [లేవీ 11:39] ఇంకా అనేకరకాలుగా [లేవీ 11వ అధ్యాయం] అపవిత్రత సంభ విస్తుంది. అపవిత్రత అనేది రోతగాను, వికారంగాను వుండేవాటివల్ల సంప్రాప్తిస్తుం దని వాళ్లు భావించుకున్నట్టు నేడు మనం చెప్పుకోవచ్చు. అంతేగాని దేవుడు పేర్కొన్న రీతిలో అటువంటి అపవిత్రతను పరిశుద్ధత పొందవలసిన లేదా శిక్షింపబడవలసిన నేరంగా పరిగణించడం తప్పు)

## సహజమరణం పొందిన. లేదా వేటాడబడ్డ జంతువులను తిన్న వారికి మరణశిక్ష

అతడు కళేబరమునైనను చీల్చబడిన దానినైనను తిని దానివలన అపవిత్ర పరచుకొన కూడదు. నేను యెహోవాను కాబట్టి నేను విధించినవిధిని అపవిత్రపరచి, దాని పాపభారమును మోసికొని దానివలన చావకుండునట్లు ఈ విధిని ఆచరింప వలెను. లేవి 22:8,9. (లేవీ 17:13–16 కూడ చూడండి)

(జబ్బుతో చచ్చిపోయిన జంతువును పరదేశస్థులకు ఆహారంగా అమ్మవచ్చు (ద్వితీ 14 : 21). ఎందువల్లనంటె ఇశ్రాయేలీయులు దేవునికి ప్రియమైనవారు, ఇతరులు అప్రియులు)

## ప్రాయశ్చిత్తార్థ దినమందు ఏ పనినైనా చేసినవారికి మరణశిక్ష

ఆ దినమున తన్నుతాను దుఃఖపరచుకొనని ప్రతివాడు తన ప్రజలలో నుండి కొట్టివేయబడును. ఆ దినమున ఏ పనినైనను చేయు ప్రతివానిని వాని ప్రజలలో నుండకుండ నాశము చేసెదను. లేవీ 23:29,30.

## మందిరాన్ని సమీపిస్తే మరణశిక్ష

మందిరము దిగునప్పుడు లేవీయులే దానివేయవలెను. అన్యుడు సమీపించిన యెడల వాడు మరణశిక్ష నొందును. సంఖ్యా 1:51.

ఇశ్రాయేలీయులు పాపము తగిలి చావకుండునట్లు వారు ఇక మీదట ప్రత్యక్షపు గుడారమునకు రాకూడదు. సంఖ్యా 18:22.

యెహోవా మందిరమును సమీపించు ప్రతివాడును చచ్చును; మేము అందరము చావవలసియున్నదా? సంఖ్యా 17:13.

## యాజకుడిని సమీపిస్తే [illegible]ణశిక్ష

నీవు అహరోనును అతని కుమారులను నియమింపవలెను. వారు తమ యాజకధర్మమునుసరించి నడుచుకొందురు. అన్యుడు సమీపించినయెడల మరణ శిక్షనొందును. సంఖ్యా 3:10. (సంఖ్యా 18:7 కూడ చూడండి)

మందిరము ఎదుటి తూర్పుదిక్కున, అనగా ప్రత్యక్షపు గుడారము ఎదుటి పూర్వదిశయందు దిగవలసినవారు మోషే అహరోనులు, అహరోను కుమారులు; ఇశ్రాయేలీయులు కాపాడవలసిన పరిశుద్ధస్థలమును వారే కాపాడవలెను. అన్యుడు సమీపించినయెడల అతడు మరణశిక్ష నొందును. సంఖ్యా 3:38

## దైవదూషణ చేస్తే మరణశిక్ష

యెహోవా నామమును దూషించువాడు మరణ శిక్షనొందవలెను. సర్వసమాజము రాళ్ళతో అట్టివానిని చావగొట్టవలెను. పరదేశియేగాని, స్వదేశియేగాని యెహోవా నామమును దూషించిన యెడల వానికి మరణశిక్ష విధింపవలెను. లేవీ 24:16

ఇశ్రాయేలీయురాలి కుమారునికిని ఒక ఇశ్రాయేలీయునికిని పాళెములో పోరు పడగా ఆ ఇశ్రాయేలీయురాలి కుమారుడు యెహోవా నామమును దూషించి శపింపగా.... యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను-శపించిన వానిని పాళెము వెలుపలికి తీసికొనిరమ్ము. వాని శాపవచనమును వినిన వారందరు వాని తలమీద తమ చేతు లుంచిన తరువాత సర్వసమాజము రాళ్ళతో వాని చావగొట్టవలెను .... యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్టు ఇశ్రాయేలీయులు చేసిరి. లేవీ 24:10-14, 23

## వ్యభిచార నేరానికి మరణశిక్ష

అయితే ఆమాట నిజమైన యెడల, అనగా ఆ చిన్నదానియందు కన్యకా లక్షణములు కనబడనియెడల, వారు ఆమె తండ్రి యింటియొద్దకు ఆ చిన్నదానిని తీసికొనిరావలెను. అప్పుడు ఆమె ఊరివారు ఆమెను రాళ్లతో చావగొట్టవలెను. ఏల యనగా ఆమె తన తండ్రి యింట వ్యభిచరించి ఇశ్రాయేలీయులలో దుష్కార్యము చేసెను. ద్వితీ 22:20, 21.

(దేవుడు వ్యభిచార నేరం చేసినందుకు స్త్రీతో సమానమైన శిక్ష పురుషునికి విధింపలేదు. దయలేకుండ దేవుడు విధించిన ఈ శిక్షవల్ల నిర్దోషులైన స్త్రీలు ఎంతోమంది హత్యచేయ బడి వుంటారు. పురుషుడెవరైనా తన భార్యమీద వ్యభిచార నేరం మోపిన తరువాత అది అబద్ధమని రుజువుకాబడితే అతనికి విధించబడే శిక్ష వెండి రూపాయల్లో వుంటుంది. యాజకుని కుమార్తెలెవరైనా వ్యభిచరిస్తే వారిని మంటల్లో తగల బెట్టమని లేవీ 21:9 చెబుతున్నది)

## బహిష్టుకాలంలో సంభోగంలో పాల్గొన్న వారికి మరణ శిక్ష

కడగానున్న స్త్రీతో శయనించి ఆమె మానాచ్ఛాదనమును తీసినవాడు ఆమె రక్తధారాచ్ఛాదనమును తీసెను. ఆమె తన రక్తధారాచ్ఛాదనమును తీసివేసెను. వారి ప్రజలలో నుండి వారిద్దరిని కొట్టివేయవలెను. లేవీ 20 : 18

## బంగారు దూడనుచేసి పూజించినవారు స్నేహితులు, సోదరుల చేతిలో చంపబడ్డారు

అతడు వారిని చూచి - మీలో ప్రతివాడును తనకత్తిని తన నడుమున కట్టుకొని పాళెములో ద్వారమునుండి ద్వారమునకు వెళ్ళుచు, ప్రతివాడు తన సహోదరుని ప్రతివాడు తన చెలికానిని ప్రతివాడు తన పొరుగువానిని చంపవలెనని ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా సెలవిచ్చుచున్నాడనెను. లేవీయులు మోషే మాట చొప్పున చేయగా ఆ దినమున ప్రజలలో ఇంచుమించు మూడువేలమంది కూలిరి. ఏలయనగా మోషే వారిని చూచి - నేడు యెహోవా మిమ్మును ఆశీర్వదించునట్లు మీలో ప్రతివాడు తన కుమారుని మీద పడియేగాని తన సహోదరుని మీద పడియేగాని యెహోవాకు మిమ్మును మీరే ప్రతిష్ట చేసికొనుడనెను .... అహరోను కల్పించిన దూడను ప్రజలు చేయించినందున యెహోవా వారిని బాధపెట్టెను. నిర్గ 32:27-29,35.

## సణుగుడుకు శిక్ష

జనులు ఆయాసమునుగూర్చి సణుగుచుండగా అది యెహోవాకు వినబడెను; యెహోవా దాని వినినప్పుడు ఆయన కోపము రగులుకొనెను; యెహోవా అగ్ని వారిలో రగులుకొని ఆ పాళెములో నొకకొనను దహింపసాగెను.

సంఖ్యా 11 : 1.

## ఆహారంలో మార్పుకోరుకున్న ప్రజలు చంపబడ్డారు

వారి మధ్యనున్న మిశ్రితజనము మాంసాపేక్ష అధికముగా కనపరచగా ఇశ్రాయేలీయులును మరల ఏడ్చి — మాకెవరు మాంసము పెట్టెదరు? ఐగుప్తులో మేము ఉచితముగా తినిన చేపలను కీరకాయలను దోసకాయలను కూరాకులను ఉల్లిపాయలను తెల్లగడ్డలను జ్ఞాపకమునకు వచ్చుచున్నవి. ఇప్పుడు మా ప్రాణము సొమ్మసిల్లెను. ఈ మన్నా కాక మా కన్నుల యెదుట మరేమియులేదని చెప్పుకొనిరి....

తరువాత యెహోవా సన్నిధినుండి ఒకగాలి బయలుదేరి సముద్రమునుండి పూరేళ్ళను రప్పించి పాళెము చుట్టు....పడజేసెను .... ఆ మాంసము ఇంక వారి పండ్లసందున నుండగానే అది నమలక మునుపే, యెహోవా కోపము జనుల మీద రగులుకొనెను; యెహోవా తెగులు చేత వారిని బహుగా బాధించెను. మాంసాపేక్ష గలవారిని జనులు అక్కడ పాతిపెట్టినందున ఆ స్థలమునకు కిబ్రోతుహత్తావా (దురాశ) అను పేరు పెట్టబడెను. సంఖ్యా 11:4-6, 31-34.

## ధూపం సరిగా వేయనందుకు యాజకుల దహనం

అహరోను కుమారులైన నాదాబు అబీహులు తమతమ ధూపార్తులను తీసికొని వాటిలో నిప్పులుంచి వాటిమీద ధూపద్రవ్యము వేసి, యెహోవా తమ కాజ్ఞాపింపని వేరొక అగ్నిని ఆయన సన్నిధికి తేగా యెహోవా సన్నిధినుండి అగ్ని బయలుదేరి వారిని కాల్చివేసెను. లేవీ 10:1,2.

## అగ్ని, భూకంపం, తెగుళ్ళతో విరోధుల్ని చంపిన దేవుడు

ఇశ్రాయేలీయులలో పేరుపొందిన సభికులును సమాజ ప్రధానులు .... మోషే అహరోనులకు విరోధముగా పోగుపడి .... మీతో మాకిక పనిలేదు; ఈ సర్వసమాజములోని ప్రతివాడును పరిశుద్ధుడే. యెహోవా వారిమధ్యనున్నాడు. యెహోవాసంఘం మీద మిమ్మును మీరేల హెచ్చించుకొనుచున్నారనగా....యెహోవా–మీరు ఈ సమాజములో నుండి అవతలికి వెళ్లుడి. క్షణములో నేను వారిని కాల్చివేయుదునని మోషే అహరోనులతో చెప్పగా వారు సాగిలపడి సమస్తశరీరాత్మలకు దేవుడవైన దేవా,ఈ యొక్కడు పాపము చేసినందున ఈ సమస్త సమాజము మీద నీవు కోపపడుదువా అని వేడుకొనిరి....దాతాను అబీరాములును వారి భార్యలును వారి కుమారులును వారి పసిపిల్లలును తమ గుడారముల ద్వారమున నిలిచిరి–వారి క్రిందినేల నెరవిడచెను.భూమి తన నోరు తెరచి వారిని వారి కుటుంబములను కోరహు సంబంధులందరిని వారి సమస్త సంపాద్యమును మ్రింగివేసెను. వారును సంబంధులందరును ప్రాణముతో పాతాళములో కూలిరి; భూమి వారిని మ్రింగివేసెను. వారు సమాజములో ఉండకుండ నశించిరి....మరియు యెహోవా యొద్దనుండి అగ్నిబయలుదేరి ధూపార్పణమును తెచ్చిన ఆ రెండువందల ఏబదిమందిని కాల్చివేసెను.

సంఖ్యా 16:2,3,20-22,27,31-35.

కోరహు తిరుగుబాటున చనిపోయినవారుగాక పదునాలుగువేల ఏడువందల మంది ఆ తెగులుచేత చచ్చిరి. సంఖ్యా 16 : 49.

## బాధల్ని మొరపెట్టుకుంటె విషసర్పాలతో చంపిన దేవుడు

కాగా ప్రజలు దేవునికిని మోషేకును విరోధముగా మాటలాడి-ఈ అరణ్యములో చచ్చుటకు ఐగుప్తులో నుండి మీరు మమ్మునెందుకు రప్పించితిరి ? ఇక్కడ ఆహారము లేదు, నీళ్లులేవు, చలి సారములు లేని ఈ అన్నము మాకు అసహ్యమైనదనిరి. అందుకు యెహోవా ప్రజలలోనికి తాపకరములైన సర్పములను పంపెను. అవి ప్రజలను కరువగా ఇశ్రాయేలీయులలో అనేకులు చనిపోయిరి.

సంఖ్యా 21 : 5, 6.

## పవిత్ర సంహారం: నిస్సహాయులైన స్త్రీలను, పిల్లలను పెద్ద మొత్తంలో హత్యచేసి దోపుడుసొమ్ము క్రింద 32,000 మంది యువతుల అపహరణ !

యెహోవా – మిద్యానీయులు ఇశ్రాయేలీయులకు చేసిన హింసకు ప్రతిహింస చేయుడి....యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లువారు మిద్యానీయులతో యుద్ధముచేసి మగవారినందరిని చంపిరి....అప్పుడు ఇశ్రాయేలీయులు మిద్యానుస్త్రీలను వారి చిన్న పిల్లలను చెరపట్టుకొని, వారి సమస్త పశువులను వారి గొఱ్ఱెమేకలన్నిటిని వారికి కలిగినది యావత్తును దోచుకొనిరి. మరియు వారి నివాస పట్టణములన్నిటిని వారి కోటలన్నిటిని అగ్నిచేత కాల్చివేసిరి. వారు మనుష్యులనేమి పశువులనేమి సమస్తమైన కొల్లసొమ్మును మిద్యానీయుల ఆస్తిని యావత్తును తీసికొనిరి....మోషే....సేనానాయకుల మీద కోపపడెను. మోషే వారితో– మీరు ఆడువారినందరిని బ్రదుకనిచ్చితిరా:....మీరు పిల్లలలో ప్రతి మగవానిని పురుష సంయోగము ఎరిగిన ప్రతి స్త్రీని చంపుడి; పురుషసంయోగము ఎరుగని ప్రతి ఆడుపిల్లను మీ నిమిత్తము బ్రదుకనీయుడి. సంఖ్యా 31:1–8.

[మోషే ఐగుప్తు నుండి వచ్చినపుడు మిద్యానీయులు అతను బ్రతకడానికి వీలుగా 40 సంవత్సరాలు ఆశ్రయం కల్పించారు. (నిర్గ 2:15) తనను ఆదరించిన వారిమీద తన కున్న భక్తివిశ్వాసాలను మోషే ఈ రకమైన ఘోరచర్యద్వారా తీర్చుకున్నాడు. మిద్యా

నీయులంటే అబ్రాహాము కుమారుడైన మిద్యాను సంతతివారు (ఆది 25:2) ఆ రకంగా వారు ఇశ్రాయేలీయులకు దగ్గర బంధువులే అవుతారు. మోయాబీయులు, అమ్మోనీయులు వావివరుసల్లేకుండా లోతుకు పుట్టిన సంతానం. దేవుడువారికి ప్రత్యేక రక్షణ కల్పించాడు. (ద్వితీ 2:8,9,19)]

## దోపిడిలో దొరికిన అమ్మాయిలను దేవుడు సైనికులకు, సర్వసమాజానికి, తనకు వాటాలు నిర్ణయించాడు !

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను....మనుష్యులలోనేమి, పశువులలోనేమి చెరపట్టబడిన దోపుడు సొమ్ము మొత్తమును లెక్కించి రెండు భాగములుగా చేసి యుద్ధమునకు పూనుకొని సేనగా బయలుదేరిన వారికి సగమును సర్వసమాజమునకు సగమును పంచిపెట్టవలెను. మరియు సేనగా బయలుదేరిన యోధుల మీద యెహోవాకు పన్నుకట్టి, ఆ మనుష్యులలోను పశువులలోను గాడిదలలోను గొర్రెమేకలలోను అయిదువందలకు ఒకటి చొప్పున వారి సగములోనుండి తీసికొని యెహోవాకు ప్రతిష్టార్పణముగా యాజకుడైన ఎలియాజరుకు ఇయ్యవలెను. మనుష్యులలోను, పశువులలోను గాడిదలలోను, గొర్రెమేకలలోను సమస్తవిధముల జంతువులలోను ఏబదింటికి ఒకటి చొప్పున, ఇశ్రాయేలీయులు సగములోనుండి తీసికొని యెహోవా మందిరమును కాపాడు లేవీయులకు ఇయ్యవలెను.

సంఖ్యా 31:25_30.

ఆ దోపుడు సొమ్ము అనగా ఆ సైనికులు కొల్లగొట్టిన సొమ్ములో మిగిలినది ఆరులక్షల డెబ్బదియయిదు గొర్రెమేకలును .... ముప్పదిరెండువేల మంది పురుషసంయోగమెరుగని స్త్రీలను....గాడిదలు ముప్పది రెండువేల ఆయిదువందలు, వాటిలో యెహోవాపన్ను అరువదియొకటి. మనుష్యులు పదునారు వేలమంది. వారిలోయెహోవా పన్ను ముప్పది యిద్దరు. సంఖ్యా 31:32_40.

ఇంగ్లీషు బైబిళ్ళలో "ఆరులక్షల డెబ్బదియైదువేల గొర్రెమేకలును" అని వుండగా పరిశుద్ధ గ్రంథము లన్నిటిలోను చాల కాలంనుండి "ఆరులక్షల డెబ్బదిఅయిదు గొర్రె మేకలును" అని ముద్రితమవుతున్నది. ఇంత పెద్దతప్పును క్రైస్తవు లెవరూ గమనించినట్లు లేదు-అను]

[ఆ రకంగా యాజకులు 32 మంది వయస్సులోవున్న యువతులను దోపుడు సొమ్ములో తమ వాటాగా తీసుకున్నారు]

## కృతఘ్నులపట్ల, నిర్లక్ష్యంగావున్న మిత్రులపట్ల దేవుడి చర్య

మీ మధ్యకు అడవి మృగములను రప్పించెదను; అవి మిమ్మును సంతాన రహితులుగా చేయును. లేవీ 26 : 22.

నేను కోపపడి మీకు విరోధముగా నడిచెదను. నేనే మీ పాపములను బట్టి యేడంతలుగా మిమ్మును దండించెదను. మీరు మీ కుమారుల మాంసమును తినెదరు, మీ కుమార్తెల మాంసమును తినెదరు. లేవీ 26:28,29.

## దేవుడి శాపనార్థాలు

యెహోవా క్షయరోగముచేతను, జ్వరముచేతను, మంటచేతను, మహాతాపము చేతను, ఖడ్గముచేతను, కంకికాటుకచేతను, బూజుచేతను నిన్నుకొట్టును; నీవు నశించు వరకు అవి నిన్ను తరుమును. నీ తలపైని ఆకాశము ఇత్తడివలెనుండును, నీ క్రింద నున్న నేల యినుమువలె ఉండును. యెహోవా నీ దేశపు వర్షమును ధూళిగాను బుగ్గిగాను చేయును. నీవు నశించువరకు అది ఆకాశమునుండి నీ మీదికి వచ్చును .... నీ కళేబరము సకలమైన ఆకాశపక్షులకును భూజంతువులకును ఆహారమగును; వాటిని బెదిరించువాడెవడును ఉండడు. యెహోవా ఐగుప్తుపుంటిచేతను మూలవ్యాధి చేతను కుష్ఠుచేతను గజ్జిచేతను నిన్నుబాధించును. నీవు వాటిని పోగొట్టుకొన జాలకుందువు. వెర్రితనముచేతను గ్రుడ్డితనముచేతను హృదయవిస్మయముచేతను యెహోవా నిన్ను బాధించును. ద్వితీ 28:22,28.

అప్పుడు ముట్టడిలోను నీ శత్రువులు నిన్నుపెట్టు ఇబ్బందిలోను నీ గర్భ ఫలమును, అనగా నీ దేవుడైన యెహోవా నీకిచ్చిన నీ కుమారులయొక్కయు నీ కుమార్తెలయొక్కయు మాంసమును తిందువు. ద్వితీ 28:53.

నాకోపాగ్ని రగులుకొనును. పాతాళాగాధము వరకు అది దహించును. అది భూమిని దాని పంటను కాల్చును. పర్వతముల పునాదులను రవల బెట్టును. వారి ఆపదలను విస్తరింపజేసెదను. వారి మీద నా బాణములన్నిటిని వేసెదను. వారు కరవుచేత క్షీణించుదురు మంటచేతను క్రూరమైన హత్యచేతను హరించి పోవుదురు. బురదలో ప్రాకు పాముల విషమును మృగముల కోరలను వారిమీదికి రప్పించెదను. బయట ఖడ్గమును లోపట భయమును యౌవనులను కన్యకలను శిశువులను నెరసిన

తలవెంట్రుకలు గలవారిని నశింపజేయును....రక్తముచేత నా బాణములను మత్తిల్ల చేసెదను. చంపబడిన వారి రక్తమును చెరపట్టబడినవారి రక్తమును శత్రువులలో వీరుల తలలను నా ఖడ్గము భక్షించును. ద్వితీ 32:22–42.

## జాతిమొత్తం ఊచకోత

అయితే హెష్బోనురాజైన సీహోను మనలను తన దేశ మార్గమున వెళ్ల నిచ్చుటకు సమ్మతింపలేదు. నేడు జరిగినట్లు నీచేతికి అతని అప్పగించుటకు నీ దేవుడైన యెహోవా అతని మనస్సును కఠినపరచి అతని హృదయమునకు తెంపు కలుగజేసెను....ఆ కాలమున అతని సమస్తపురములను పట్టుకొని, ప్రతి పురమును అందలి స్త్రీ పురుషులను పిల్లలను శేషమేమియులేకుండ నాశనము చేసితిమి.

ద్వితీ 2:30,34.

## బాషాను ప్రజల సంహారం

మనము హెష్బోనురాజైన సీహోనుకు చేసినట్లు వాటిని నిర్మూలము చేసితిమి; ప్రతి పురములోని స్త్రీ పురుషులను పిల్లలను నిర్మూలము చేసితిమి.

ద్వితీ 3:6.

## ఏడుజాతుల విధ్వంసం

సంఖ్యకును బలమునకును నిన్నుమించిన....ఏడు జనములను నీ యెదుట నుండి వెళ్లగొట్టిన తరువాత నీ దేవుడైన యెహోవావారిని నీ కప్పగించునప్పుడు నీవు వారిని హతము చేయవలెను, వారిని నిర్మూలము చేయవలెను. వారితో నిబంధన చేసికొన కూడదు, వారిని కరుణింపకూడదు....నీవు నీ దేవుడైన యెహోవాకు ప్రతిష్ఠిత జనము, నీ దేవుడైన యెహోవా భూమిమీద నున్న సమస్త జనములకంటె నిన్ను ఎక్కువగా ఎంచి, నిన్ను తనకు స్వకీయజనముగా చేసికొనెను.

ద్వితీ 7:1–6.

అయితే నీదేవుడైన యెహోవా స్వాస్థ్యముగా నీకిచ్చుచున్న ఈ జనముల పురములలో ఊపిరిగలదేనిని బ్రదుకనియ్యకూడదు. వీరు, అనగా హిత్తీయులు అమోరీయులు కనానీయులు పెరిజ్జీయులు హివ్వీయులు యెబూసీయులను .... నీ దేవుడైన యెహోవా నీకాజ్ఞాపించిన ప్రకారము నిర్మూలము చేయవలెను. ద్వితీ 20:16,17.

## హత్యలుచేసే కందిరీగలు

మరియు మిగిలినవారును నీ కంటబడక దాగినవారునునశించువరకు నీదేవుడైన యెహోవావారి మీదికి పెద్ద కందిరీగలను పంపును. వారిని చూచి జడియవద్దు; నీ దేవుడైన యెహోవా నీ మధ్యనున్నాడు, అయన భయంకరుడైన మహాదేవుడు.

ద్వితీ 7:20.21.

## దైవాజ్ఞప్రకారం స్త్రీ, శిశు, నరహత్య!

అప్పుడు యెహోషువ మన్యప్రదేశమును దక్షిణ ప్రదేశమును షెపేలాప్రదేశమును చరియల ప్రదేశమును వాటిరాజుల నందరినిజయించెను. ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా ఆజ్ఞాపించినట్లు అతడు శేషమేమియు లేకుండ ఊపిరిగల సమస్తమును నిర్మూలము చేసెను. యెహో 10 : 40.

ఆ దినమున యెహోషువ మక్కేదాను పట్టుకొని దానిని దానిరాజును కత్తివాతను హతముచేసెను. అతను వారిని దానిలోనున్న వారందరిని నిర్మూలముచేసెను. యెరికో రాజుకు చేసినట్లు మక్కేదారాజునకు చేసెను. యెహో 10:28.

(ఈరకమైన జనసంహార చర్యలకొరకు యెహో 10:30_39; 11:11-15,21; 8:26 కూడ చూడండి)

## యెరికో పట్టణములో పవిత్ర సంహారం

ఈ పట్టణమును దీనిలో నున్నది యావత్తును యెహోవా వలన శపించబడెను రాహాబు అనువేశ్య మనము పంపినదూతలను దాచిపెట్టెను గనుక ఆమెయు ఆయింటనున్న వారందరును మాత్రమే బ్రదుకుదురు .... వారు పురుషులనేమి స్త్రీలనేమి చిన పెద్దలనందరిని యెద్దులను గొర్రెలను గాడిదలను ఆ పట్టణములోని సమస్తమును కత్తివాత సంహరించిరి. యెహో 6:17,21.

## దేవుడి సంతృప్తికోసం అకాను కుటుంబాన్ని రాళ్లతో చావగొట్టి మంటల్లో కాల్చారు

యెహోవా యెహోషువతో ఇట్లనెను .... శపితమైనది యెవనియొద్ద దొరుకునో

వానిని వానికికలిగినవారినందరిని అగ్నిచేత కాల్చివేయవలెను....తరువాతయెహోషువయు ఇశ్రాయేలీయులందరును జెరహు కుమారుడైన అకానును .... అకాను కుమారులను కుమార్తెలను ఎద్దులను గాడిదలను మందను డేరాను వానికి కలిగిన సమస్తమును పట్టుకొని....ఇశ్రాయేలీయులందరు వానిని రాళ్లతో చావగొట్టిరి. వారిని రాళ్ళతోకొట్టిన తరువాత అగ్నిచేత కాల్చి వారిమీద రాళ్ళను పెద్దకుప్పగా వేసిరి....అప్పుడుయెహోవా కోపోద్రేకము విడిచినవాడై మళ్ళుకొనెను. యెహో 7: 0_26.

(పట్టణాన్ని దోచితెచ్చిన బంగారంలో అకాను కొంత తీసుకొని యాజకులకు అప్పగించ కుండ దాచాడు. ఈ పని దేవుడిదృష్టికి అసహ్యకరమైన నేరం కనుక ఆ దొంగతనం చేసిన వ్యక్తి కుటుంబాన్నంతటినీ తగుల బెట్టాలట. పట్టణంలోని వారినందరినీ హత్య చేయించడం ధర్మకార్యమవడంవల్ల అపారమైన దయాగుణంగల దేవుడు పెద్దసంఖ్యలో జనసంహారం చేసి దాన్ని నరకంగా మార్చమని ఆజ్ఞ ఇచ్చాడు)

## పవిత్రమైన ఖూనీ!

ఇశ్రాయేలీయులు యెహోవాకు మొరపెట్టగా బెన్యామీయుడైన గెరా కుమారుడగు ఏహూదను రక్షకుని వారికొరకు యెహోవా నియమించెను. అతడు ఎడమచేతి పనివాడు. అతనిచేతను ఇశ్రాయేలీయులు మోయాబురాజైన ఎగ్లోనుకు కప్పముపంపగా ఏహూదు మూరెడు పొడవుగల రెండంచులకత్తిని చేయించుకొని, తన వస్త్రములో తన కుడి తొడమీద దానిని కట్టుకొని .... రాజా, రహస్యమైన మాట ఒకటి నేను నీతో చెప్పవలెననగా అతడు_తనయొద్ద నిలిచిన వారందరు వెలుపలికి పోవువరకు ఊర కొమ్మని చెప్పెను. ఏహూదు అతని దగ్గరకు వచ్చినప్పుడు అతడు ఒక్కడే చల్లని మేడగదిలో కూర్చుండియుండెను. ఏహూదు_నీతో నేను చెప్పవలసిన దేవునిమాట ఒకటి యున్నదనిచెప్పగా అతడు తన పీఠముమీదనుండి లేచెను. అప్పుడు ఏహూదు తన యెడమచేతిని చాపి తనకుడి తొడమీదనుండి ఆ కత్తితీసి కడుపుమీద అతనిపొడిచెను. పిడియును కత్తివెంబడి దూరగా క్రొవ్వు కత్తిపైని కప్పుకొనినందున అతని కడుపునుండి కత్తిని తీయలేకపోయెను. న్యాయా 3:15_22.

## మోసంతో హత్యచేసిన వారికి పొగడ్త

యెహోవా ఒక స్త్రీచేతికి సీసెరాను అప్పగించును....హాసోరు రాజైన యాబీను కును కయీనీయుడైన హెబెరు వంశస్థులకును సమాధానము కలిగియుండెను గనుక

సీసెరా కాలినడకను కయీనీయుఁడగు హెబెరుభార్యయైన యాయేలు గుడారమునకు పారిపోయెను. అప్పుడు యాయేలు సీసెరాను ఎదుర్కొనబోయి అతనిని చూచి - నా యేలిన వాడా నా తట్టు తిరుగుము, తిరుగుము భయపడకుమని చెప్పినందున అతడు ఆమె గుడారమును జొచ్చెను. ఆమె గొంగళితో అతనికప్పి....పిమ్మట హెబెరుభార్యయైన యాయేలు గుడారపుమేకు తీసికొని సుత్తెచేత పట్టుకొని అతనియొద్దకు మెల్లగా వచ్చి అతనికి అలసటచేత గాఢనిద్ర కలిగియుండగా నేలకు దిగునట్లు అ మేకును అతని కణతలలో దిగగొట్టగా అతడు చచ్చెను....సీసెరా చచ్చిపడియుండెను, ఆ మేకు అతని కణతలలో నుండెను. ఆ దినమున దేవుడు ఇశ్రాయేలీయుల యెదుట కనాను రాజైన యాబీనును అణచెను. న్యాయా 4:9,17-23.

కయీనీయుడైన హెబెరు భార్య యాయేలు స్త్రీలలో దీవెననొందును. గుడారములలో నుండు స్త్రీలలో ఆమె దీవెననొందును ...ఆమె మేకును చేతపట్టుకొనెను. పనివాని సుత్తెను కుడిచేత పట్టుకొని సీసెరాను కొట్టెను. వానితలను ఆమె పగుల గొట్టెను. ఆమె ఆతని తలను సుత్తెతో కొట్టగా అది పగిలెను... యెహోవా నీ శత్రువులందరు ఆలాగుననే నశించెదరు. న్యాయా 5:24, 26 31

## బట్టలకోసం 30 మందిని చంపిన సమ్సోను

యెహోవా ఆత్మ అతని మీదికి మరలరాగా అతడు అష్కెలోనుకు పోయి వారిలో ముప్పదిమందిని చంపివారి సొమ్మును దోచుకొని తన విప్పుడు కథ భావమును చెప్పినవారికి బట్టలనిచ్చెను. న్యాయా 14:19.

## జంతువులపట్ల క్రౌర్యం, పంటల దహనం

అప్పుడు సమ్సోను పోయి మూడువందల నక్కలను పట్టుకొని దివిటీలను తెప్పించి తోకతట్టు తోకనుత్రిప్పి రెండేసి తోకలమధ్యను ఒక్కొక్క దివిటీకట్టి ఆ దివిటీలో అగ్నిమండచేసి ఫిలిష్తీయుల గోధుమ చేలలోనికి వాటిని పోనిచ్చి పనల కుప్పలను పైరును ద్రాక్షతోటలను ఒలీవతోటలను తగులబెట్టెను.

న్యాయా 15:4,5.

## సమ్సోను విధ్వంసక శక్తి

యెహోవా ఆత్మ అతని మీదికి బలముగావచ్చినందున....అతడు గాడిదయొక్క

వచ్చి దవడయెముకను కనుగొని చెయ్యిచాచి పట్టుకొని దానిచేత వెయ్యిమంది మను ష్యులను చంపెను. న్యాయా 15.14,15.

ఆ గుడికి ఆధారముగానున్న రెండు మధ్య స్తంభములు .. చేతను పట్టు కొని.... బలముతో వంగినప్పుడు గుడి ఆ సర్దారుల మీదను దానిలోనున్న జనులందరి మీదను పడెను. మరణకాలమున అతడు చంపినవారి శవములలెక్క జీవితకాల మందు అతడు చంపినవారి లెక్కకంటె ఎక్కువాయెను.

న్యాయా 16 : 29, 30.

## శాంతియుత జీవనంచేసే ప్రజల వధ

ఆ యాజకుడు క్షేమముగా వెళ్లుడి, మీరు చేయబోవు పని యెహోవా దృష్టికి అనుకూలమని వారితో చెప్పెను. కాబట్టి ఆ ఐదుగురు మనుష్యులు వెళ్లి లాయిషునకు వచ్చి, దానిలోని జనము సీదోనీయులవలె సుఖముగాను నిర్భయముగాను నివ సించుట.... చూచిరి....వారు (దానువారు)....లాయిషు వారిమీదికి వచ్చి కత్తివాత వారిని హతముచేసి అగ్నిచేత ఆ పట్టణమును కాల్చివేసిరి.

న్యాయా 18:6,7,27.

## భార్యలను పొందే ధర్మమార్గం

వారి (భార్యల) విషయములో ఏమిచేయగలము ?....కాబట్టి సమాజపువారు పరాక్రమవంతులైన పండ్రెండువేలమంది మనుష్యులను పంపించి మీరు పోయి స్త్రీల నేమి పిల్లలనేమి యాబేష్గిలాదు నివాసులందరిని కత్తివాతను హతము చేయుడి. మీరు చేయవలసినదేమనగా, ప్రతి పురుషుని పురుషసంయోగము నెరిగిన ప్రతి స్త్రీని నశింప జేయవలెనని చెప్పిరి. యాబేష్గిలాదు నివాసులలో పురుషసంయోగము నెరుగని నాలుగు వందలమంది కన్యలైన స్త్రీలు దొరకగా....ఆ వేళను బెన్యామీనీయులు తిరిగివచ్చిరి. అప్పుడు వారు తాము యాబేష్గిలాదు స్త్రీలలో బ్రదుకనిచ్చిన వారిని వారికిచ్చి పెండ్లి చేసిరి. న్యాయా 21:7–14.

## దాగోనుకన్న అధికుడనని నిరూపించుకోవడానికి దేవుడి పద్ధతి

ఫిలిష్తీయులు దేవుని మందసమును....తీసికొనివచ్చి....దాగోను గుడిలో దాగోను యెదుట దాని నుంచిరి....యెహోవా హస్తము అష్డోదువారిమీద భారముగా

ఉండెను. అష్డోదువారిని దాని సరిహద్దులలోనున్నవారిని ఆయన గడ్డల రోగముతో మొత్తివారిని హతము చేసెను. 1 సమూ 5:2,6.

(దేవుడి మందసమును తీసికొనిపోయిన మిగతా పట్టణాల ప్రజలుకూడ ఈరకంగానే చంపబడ్డారు. 1 సమూ 5:8-12 చూడండి)

## పెట్టెను తెరచి చూసినందుకు 50,070 మందిని చంపిన దేవుడు

బేత్షెమెషువారు యెహోవా మందసమును తెరచిచూడగా దేవుడు వారిని హతముచేసి ఆ జనులలో యాబదివేలడెబ్బదిమందిని మొత్తెను. యెహోవా గొప్ప దెబ్బతో అనేకులను మొత్తగా జనులు దుఃఖాక్రాంతులైరి. 1 సమూ 6:19.

## ఎప్పుడో 400 సంవత్సరాలక్రితం అమాలేకీయులు చేసిన నేరానికి ఆ వంశస్థులనందరినీ చంపించిన దేవుడు

సమూయేలు సౌలును పిలిచి .. సైన్యముల కధిపతియగు యెహోవా సెల విచ్చినదేమనగా—అమాలేకీయులు ఇశ్రాయేలీయులకు చేసినది నాకు జ్ఞాపకమే, వారు ఐగుప్తులోనుండి రాగానే అమాలేకీయులు వారికి విరోధులై మార్గమందు వారిమీదికి వచ్చిరిగదా. కాబట్టి నీవుపోయి కనికరింపక అమాలేకీయులను హతము చేయుచు, పురుషులనేమి స్త్రీలనేమి బాలురనేమి పసిపిల్లలనేమి గొఱ్ఱెలనేమి ఒంటెలనేమి గార్దభములనేమి....నిర్మూలము చేయుమని చెప్పెను....అమాలేకీయుల రాజైన అగగును ప్రాణముతో పట్టుకొని జనులనందరిని కత్తిచేత నిర్మూలము చేసెను.

1 సమూ 15:1-8.

(సౌలు అగగును ప్రాణాలతో వదిలినందుకు దేవుడికి కోపం వచ్చి అతని కిరీటాన్ని తీసివేసి దావీదుకు తొడిగాడు 1 సమూ 15:10-28 చూడండి)

## అగగును ముక్కలుగా నరికారు

సమూయేలు .... గిల్గాలులో యెహోవా సన్నిధిని అగగును తుత్తునియలుగా నరికెను. 1 సమూ 15:33.

## 200 మంది ఫిలిష్తీయులను చంపి వాళ్ళకు సున్నతిచేసిన దావీదు!

గడువు దాటకముందే లేచి (దావీదు తనవారితో పోయిఫిలిష్తీయులలో రెండు

వందల మందిని హతముచేసి వారి ముందోళ్ళు తీసికొని వచ్చి రాజునకు అల్లుడ టకై కావలసిన లెక్కపూర్తిచేసి అప్పగించెను. 1 సమూ 18:27.

## జనసంహారంచేసి ఆస్తులను దోచుకొని జీవించిన దావీదు

దావీదును అతనివారును బయలుదేరి గెషూరీయుల మీద గెజెరీయులమీదను అమాలేకీయులమీదను పడిరి .... దావీదు ఆ దేశస్థులను హతముచేసి మగవానినేమి ఆడుదానినేమి యెవరిని సజీవులుగా విడువక గొఱ్ఱెలను ఎడ్లను గార్దభములను ఒంటెలను వస్త్రములను దోచుకొని....వచ్చెను. 1 సమూ 27:8.9.

## అమాలేకీయుల అహింసకు ప్రతిచర్యగా దావీదు హింస

ఘనులనేమి అల్పులనేమి అందులోనున్న ఆడువారినందరిని చెరపట్టుకొని చంపక వారిని తీసికొని (అమాలేకీయులు) వెళ్ళిపోయి యుండిరి.... దావీదును నాలుగు వందలమందియును ఇంక తరుముచుపోయిరి....దావీదు సంగతిని గ్రహించి సంధ్యవేళ మొదలుకొని మరునాటి సాయంత్రము వరకు వారిని హతము చేయుచుండగా, ఒంటెల మీద ఎక్కి పారిపోయిన నాలుగు వందలమంది యౌవనులు తప్ప తప్పించుకొనిన వారు ఒక్కడును లేకపోయెను. ఈ లాగున దావీదు అమాలేకీయు దోచుకొని పోయిన దానంతటిని తిరిగి తెచ్చుకొనెను. మరియు అతడు తనయిద్దరు భార్యలను రక్షించెను. 1 సమూ 30:2,10,17,18.

## మందసము పడిపోకుండ పట్టుకున్నందుకు ఉజ్జాకు మరణ శిక్ష

వారు నాకోను కళ్ళము దగ్గరకు వచ్చినప్పుడు ఎడ్లకు కాలు జారినందున ఉజ్జా చేయిచాపి దేవుని మందసమును పట్టుకొనగా యెహోవా కోపము ఉజ్జామీద రగులు కొనెను. అతడుచేసిన తప్పునుబట్టి దేవుడు ఆ క్షణమందే అతని మొత్తగా అతడు అక్కడనే దేవుని మందసమునొద్దపడి చనిపోయెను 2 సమూ 6:6,7.

## మోయాబీ ఖైదీలలో 2/3 వంతు మందిని చంపి, పట్టుబడ్డ గుఱ్ఱముల చీలమండలు నరికించిన దావీదు

మరియు అతడు మోయాబీయులను ఓడించి, (పట్టుబడినవారిని) నేల పొడుగున పండజేసి, తాడుతో కొలిచి రెండుతాడుల పొడుగుననున్న వారు చావవలెనని యు,

ఒక తాడు పొడుగున నున్నవారు బ్రదుకవచ్చుననియు నిర్ణయించెను.
2 సమూ 8 : 2.

అతనియొద్దనుండి వెయ్యిన్ని యేడువందల మంది గుఱ్ఱపు రౌతులను.... పట్టుకొని....వాటికి చీలమండనరములను తెగవేయించెను. 2 సమూ 8 : 4.

## ఊరియా భార్యతో వ్యభిచారముచేసి అతడిని చంపించిన దావీదు

ఒకానొక దినమున పొద్దుగ్రుంకువేళ దావీదు పడకమీద నుండి లేచి రాజనగరి మిద్దెమీద నడుచుచు పై నుండి చూచుచుండగా స్నానముచేయు ఒక స్త్రీ కనబడెను. ఆమె బహు సౌందర్యవతియై యుండుటచూచి....దావీదు దూతలచేత ఆమెను పిలువ నంపెను. ఆమె అతనియొద్దకు రాగా అతడు ఆమెతో శయనించెను; కలిగిన అపవిత్రత పోగొట్టుకొని ఆమె తనయింటికి మరలవచ్చెను .... ఉదయమున దావీదు - యుద్ధము మోపుగా జరుగుచున్నచోట ఊరియాను ముందుపెట్టి అతడు కొట్టబడి హతమగునట్లు నీవు అతనియొద్దనుండి వెళ్ళిపొమ్మని యోవాబునకు ఉత్తరము వ్రాయించి ఊరియాచేత పంపించెను. 2 సమూ 11:2-4,14,15.

## అమ్మోనీయులను హింసించిన దావీదు

దానియందున్న జనులను అతడు వెలుపలికి కొనిపోయి వారిలో కొందరిని రంపములతో కోయించెను, కొందరిని ఇనుప దంతెలతో చీరించెను; కొందరిని గొడ్డళ్ళతో నరికించెను. ఈ ప్రకారము అతడు అమ్మోనీయుల పట్టణము లన్నిటికిని చేసెను. 1 దిన 20:3.

పట్టణములో ఉన్నవారిని బయటకు తెప్పించి రంపములచేతను పదునుగల యినుప పనిముట్లచేతను ఇనుపగొడ్డండ్లచేతను వారిని తుత్తునియలుగా చేయించి వారిని ఇటుక ఆవములో వేసెను. 2 సమూ 12 : 31.

## జనాభా లెక్కలసేకరణ జరిపినందుకు కోపించి 70,000 మందిని చంపడానికి తన దూతను పంపిన దేవుడు

తరువాత సాతాను ఇశ్రాయేలునకు విరోధముగా లేచి, ఇశ్రాయేలీయులను లెక్కించుటకు దావీదును ప్రేరేపించెను....కావున గాదు దావీదు నొద్దకు వచ్చి యిట్లనెను-మూడేండ్లపాటు కరవు కలుగుట, మూడునెలలపాటు నీ శత్రువులు కత్తిచూసి

నిన్ను తరుముగావారి యెదుట నీవు నిలువలేక నశించిపోవుట, మూడు దినముల పాటు దేశమందు యెహోవా కత్తి, అనగా తెగులు నిలుచుటచేత యెహోవాదూత ఇశ్రాయేలీయుల దేశమంతట నాశనము కలుగజేయుట, అను వీటితో ఒక దానిని నీవు కోరుకొనుమని యెహోవా సెలవిచ్చుచున్నాడు....కావున యెహోవా ఇశ్రాయేలీయుల మీదికి తెగులు పంపగా ఇశ్రాయేలీయులలో డెబ్బది వేలమంది చచ్చిరి. యెరూషలేమును నాశనము చేయుటకై దేవుడు ఒక దూతను పంపెను. 1 దిన 21:1, 11-15.

(2 సమూ 24వ అధ్యాయంకూడ చూడండి)

(జనాభా లెక్కింపు భయంకరమైన నేరంగా తలచి దేవుడు తెగులును పంపి స్త్రీ పురుషులను, పిల్లలను చంపియుంటే కనీసం 2 50,000 మంది చంపబడి వుండాలి. అసలు ఈ నేరానికి మూలకారకుడైన దావీదు శిక్షను తాననుభవించాల్సిందిపోయి తన ప్రజలను గురిచేశాడు)

## మరణశయ్యమీద ఉండగా దావీదు రహస్య ఆదేశాలు

అతని (యోవాబు) నెరిసిన తలవెండ్రుకలను సమాధికి నెమ్మదిగా దిగనియ్యవద్దు....షిమీ నీయొద్దనున్నాడు....అతడు నన్ను శపించెను....యెహోవాతోడు కత్తిచేత నేను నిన్ను చంపనని ప్రమాణము చేసితిని....వాని నెరిసిన తలవెండ్రుకలు రక్తముతో సమాధికి దిగజేయుము. 1 రాజు 2:6-9.

(యోవాబు దావీదు సేనాధిపతి. దావీదు ఆదేశాన్ని ఆ తరువాత సొలొమోను నెరవేర్చాడు. 1 రాజు 11:15,1 రాజు 2:29,34,46 చూడండి)

## దైవప్రవక్త ఏలీయా 450 మంది ప్రత్యర్థి యాజకులను చంపించడం

అప్పుడు ఏలీయా-ఒకనినైన తప్పించుకొని పోనియ్యక బయలు ప్రవక్తలను పట్టుకొనుడని వారికి సెలవియ్యగా జనులు వారిని పట్టుకొనిరి, ఏలీయా కీషోనువాగు దగ్గరకు వారిని కొనిపోయి అక్కడవారిని వధించెను. 1 రాజు 18:40.

## అగ్నితో 100 మందిని కాల్చిచంపిన ఏలీయా

అందుకు ఏలీయా-నేను దైవజనుడనైతే అగ్ని ఆకాశము నుండి దిగివచ్చి నిన్ను నీ యేబదిమందిని దహించునుగాక అని యేబదిమందికి అధిపతియైన వానితో

చెప్పగా, అగ్ని ఆకాశమునుండి దిగి వానిని వాని యేబదిమందిని దహించెను. మరల రాజు యేబదిమంది మీద అధిపతియైన మరియొకనిని వాని యేబదిమందితో కూడ పంపగా వీడు వచ్చి-దైవజనుడా, త్వరగా దిగిరమ్మని రాజు ఆజ్ఞాపించు చున్నాడనెను అందుకు ఏలీయా-నేను దైవజనుడనైతే అగ్ని ఆకాశమునుండి దిగివచ్చి నిన్ను నీ యేబదిమందిని దహించునుగాక అని చెప్పగా ఆకాశమునుండి దేవుని అగ్నిదిగి వానిని వాని యేబదిమందిని దహించెను. 2 రాజు 1:10-12.

## ఏలీషాను అపహాస్యం చేసినందుకు 42 మంది పిల్లలను చంపిన ఎలుగుబంట్లు

అక్కడనుండి (ఏలీషా) బేతేలునకు ఎక్కివెళ్ళెను అతడు త్రోవను పోవు చుండగా బాలురు పట్టణములోనుండి వచ్చి - బోడివాడా ఎక్కిపొమ్ము, బోడివాడా ఎక్కిపొమ్మని అపహాస్యముచేయగా అతడు వెనుకకు తిరిగి వారినిచూచి యెహోవా నామమునుబట్టివారిని శపించెను. అప్పుడు రెండు ఆడు ఎలుగుబంట్లు అడవిలో నుండి వచ్చివారిలో నలువది యిద్దరు బాలురను చీల్చివేసెను.

2 రాజు 2:23,24.

## అబద్ధమాడు ఆత్మద్వారా అహాబును మరణానికి గురిచేసిన దేవుడు

ఇశ్రాయేలు రాజైన అహాబు రామోతిగిలాదు మీదికిపోయి పడిపోవునట్లుఎవడు అతని ప్రేరేపించునని....అప్పుడు ఒక ఆత్మవచ్చి....నేను బయలుదేరి అతని ప్రవక్త లందరినోటను అబద్ధములాడు ఆత్మగా ఉందునని చెప్పగా యెహోవా-నీవు అతనిని ప్రేరేపించి జయింతువు, పోయి ఆ ప్రకారముగా చేయుమని సెలవిచ్చెను. యెహోవా నీ ప్రవక్తలగు వీరినోట అబద్ధములాడు ఆత్మను ఉంచియున్నాడు.

2 దిన 18:19-22.

## రాజకీయ, మత సంబంధమైన హత్యలు చేయించిన దైవ ప్రవక్తలు

అహాబు కుటుంబీకులను గూర్చి యెహోవా సెలవిచ్చిన మాటలలో ఒకటియు నెరవేరకపోదు; తన సేవకుడైన ఏలీయాద్వారా తాను సెలవిచ్చినమాట యెహోవా

నెరవేర్చెనని చెప్పెను. ఈ ప్రకారము యెహూయెజ్రెయేలులో అహాబు కుటుంబీకు లందరిని, అతని సంబంధులగు గొప్పవారినందరిని, అతని బంధువులనందరిని, అతడు నియమించిన యాజకులను హతము చేసెను. అతనికి ఒకనినైనను ఉండనియ్యలేదు.

2 రాజు 10:10,11. (2 రాజు 9:1-8; 1 రాజు 21:17-24 కూడ చూడండి)

యెహోవాను గూర్చినాకు కలిగిన ఆసక్తిని చూచుటకై నాతో కూడ రమ్మ నగా యెహూరథము మీద వారతని కూర్చుండబెట్టిరి. అతడు షోమ్రోనునకు వచ్చి షోమ్రోనులో అహాబునకు శేషించియున్న వారినందరిని చంపి; ఏలీయాకు యెహోవా సెలవిచ్చిన మాట నెరవేర్చి, అహాబును నిర్మూలము చేయువరకు హతము చేయుట మానకుండెను. తరువాత యెహూ జనులందరిని సమకూర్చి వారికీలాగు ఆజ్ఞ ఇచ్చెను. అహాబు బయలు దేవతకు కొద్దిగానే పూజచేసెను, యెహూ అను నేను అధికముగా పూజ చేయబోవుచున్నాను. కావున ఒకడైనను తప్పకుండ బయలు ప్రవక్తలనందరిని వారి యాజకులనందరిని నాయొద్దకు పిలువనంపించుడి; నేను బయలునకు గొప్ప బలి అర్పింపబోవుచున్నాను గనుక రానివాడెవడో వాని బ్రదుక నియ్యనని చెప్పెను. అయితే బయలునకు మ్రొక్కువారిని నాశనము చేయుటకై అతడు ఈ ప్రకారము కపటోపాయము చేసెను....దహనబలుల నర్పించుట సమాప్తి కాగా యెహూ—మీరు లోపలిచొచ్చి యొకడైనను బయటికిరాకుండ వారిని చంపుడని తన కావలివారితోను అధిపతులతోను చెప్పగా వారు అందరిని హతము చేసిరి. పిమ్మట కావలి వారిని అధిపతులును వారిని బయటవేసి, బయలు గుడియున్న పట్టణమునకు పోయెను....ఈ ప్రకారము యెహూ బయలుదేవతను ఇశ్రాయేలు వారి మధ్యనుండకుండ నాశనము చేసెను....కావున యెహోవా యెహూతో నీలాగు సెల విచ్చెను-నీవు నా హృదయాలోచన యంతటి చొప్పున అహాబు కుటుంబీకులకు చేసి నా దృష్టికి న్యాయమైన దాని జరిగించి బాగుగా నెరవేర్చితివి గనుక నీ కుమారులు నాలుగవ తరమువరకు ఇశ్రాయేలు రాజ్యసింహాసనముమీద ఆసీనులగుదురు.

2 రాజు 10:16-30.

## ఒక్క రాత్రిలో 1,85,000 మందిని చంపిన దేవదూత

ఆ రాత్రియే యెహోవాదూత బయలుదేరి అష్షూరువారి దండుపేటలో జొచ్చి లక్ష యెనుబదియయిదు వేలమందిని హతము చేసెను. ఉదయమున జనులు లేచి చూడగా వారందరును మృత కళేబరములై యుండిరి. 2 రాజు 19:35.

## తండ్రుల పాపాలకు బిడ్డలకు శిక్ష

తమ పితురుల దోషమును బట్టి అతని కుమారులను వధించుటకు దొడ్డి సిద్ధ పరచుడి యెష 14:21.

మూడు నాలుగుతరముల వరకు తండ్రుల దోషమును కుమారుల మీదికిని కుమారుల కుమారుల మీదికిని రప్పించెదనని ప్రకటించెను. నిర్గ 34:7.

(సంఖ్యా 14:18 కూడ చూడండి)

## అన్యజనుల నుండి పెండ్లాడిన భార్యలను, వారికి పుట్టినపిల్లలను వదిలేసిన దైవభక్తిపరాయణులు

మేము దేశమందుండు అన్యజనములలోని స్త్రీలను పెండ్లి చేసికొని మా దేవుని దృష్టికి పాపము చేసితిమి; అయితే ఈ విషయములో ఇశ్రాయేలీయులు తమ నడవడి దిద్దుకొందురను నిరీక్షణ కద్దు....ఏలినవాడవైన నీ యోచనను బట్టియు, దైవాజ్ఞకు భయపడువారి యోచనను బట్టియు ఈ భార్యలను వారికి పుట్టినవారిని వెలి వేయించెదమని మనదేవునితో నిబంధన చేసికొనెదము. ఎజ్రా 10:2,3.

## యోబు భక్తిని పరీక్షించడానికి అతని సంతానాన్ని, సేవకులను సాతాను దయాదాక్షిణ్యాలకు వదిలిన దేవుడు

యెహోవా-ఇదిగో అతనికి కలిగిన సమస్తమును నీ వశమున ఉన్నది; అతనికి మాత్రము ఏ హానియు చేయకూడదని అపవాదికి సెలవియ్యగా వాడు యెహోవా సన్నిధినుండి బయలువెళ్లెను....ఒకదూత అతని (యోబు) యొద్దకు వచ్చి- ఎద్దులు నాగలి దున్నుచు గాడిదలు వాటి సమీపమున మేయుచునుండగా షెబాయీయులు వాటిమీదపడి వాటిని పట్టుకొని పోయి ఖడ్గముతో పనివారిని హతముచేసిరి, జరిగినది నీకు తెలియజేయుటకు నేనొక్కడనే తప్పించుకొని వచ్చియున్నాననెను. అతడు ఇంక మాటలాడుచుండగా మరియొకడువచ్చి-దేవుని అగ్ని ఆకాశమునుండి పడి గొఱ్ఱెలను పనివారిని రగుల బెట్టి కాల్చివేసెను; దానిని నీకు తెలియజేయుటకు నేనొక్కడనే తప్పించుకొని వచ్చియున్నాను. అతడు ఇంకమాటలాడుచుండగా మరి యొకడు వచ్చి కల్దీయులు మూడు సమూహములుగా వచ్చి ఒంటెల మీదపడి వాటిని కొని పోయి ఖడ్గముచేత పనివారిని చంపిరి. నీకు దానిని తెలియజేయుటకు నేనొక్క-

డనే తప్పించుకొని వచ్చియున్నాననెను. అతడు మాటలాడుచుండగా వేరొకడు వచ్చి నీకుమారులును నీకుమార్తెలును తమ అన్న యింట భోజనము చేయుచు ద్రాక్ష రసము పానముచేయుచుండగా గొప్ప సుడిగాలి అరణ్య మార్గముగా వచ్చి ఆ యింటి నాలుగు మూలలను కొట్టగా అది యౌవనులమీద పడినందున వారు చనిపోయిరి. దానిని నీకు తెలియజేయుటకు నేనొక్కడనే తప్పించుకొని వచ్చియున్నాననెను.

యోబు 1:12-19.

## తప్పు దేవుడిది-శిక్ష ప్రవక్తది

మరియు ప్రవక్తయొకడు మోసపోయి యొకమాట చెప్పినయెడల యెహోవానగు నేనే ఆ ప్రవక్తను మోసపుచ్చువాడనై నేనే వానికి విరోధినై నా జనులైన ఇశ్రాయేలీయులలో నుండి వానిని నిర్మూలము చేసెదను. యెహె 14:9.

## కీర్తనలా ? శాపనార్థాలా ?

వాడు విమర్శలోనికి తేబడునప్పుడు దేహి యని తీర్పునొందునుగాక. వాని ప్రార్థన పాపమగునుగాక, వాని జీవిత దినములు కొద్దివగునుగాక. వాని ఉద్యోగమున వేరొకడు తీసికొనునుగాక. వాని బిడ్డలు తండ్రిలేనివారగుదురుగాక. వాని భార్య విధవరాలగునుగాక. వాని బిడ్డలు దేశద్రిమ్మరులై భిక్షమెత్తుదురుగాక... వానికి కృప జూపువారు లేక పోదురుగాక. తండ్రిలేని వాని బిడ్డలకు దయచూపువారు లేకపోదురుగాక... నా విరోధులకు నా ప్రాణమునకు విరోధముగా మాటలాడువారికి యిదే యెహోవా వలన కలుగు ప్రతీకారము. కీర్త 109 : 7-20.

నీ పసిపిల్లలను పట్టుకొని వారిని బండకువేసి కొట్టువాడు ధన్యుడు.

కీర్త 137 : 9.

## ఆసక్తికరమైన కృప

దేవదేవునికి కృతజ్ఞతా స్తుతులు చెల్లించుడి....ఐగుప్తుదేశపు తొలిచూలును ఆయన హతము చేసెను. ఆయన కృప నిరంతరముండును....ఫరోను అతని సైన్యమును ఎఱ్ఱ సముద్రములో ఆయన ముంచివేసెను. ఆయన కృప నిరంతరముండును ఆమోరీయుల రాజైన సీహోనును ఆయన హతము చేసెను. ఆయన కృప నిరంతరముండును. బాషాను రాజైన ఓగును ఆయన హతము చేసెను. ఆయన కృప నిరం

తరముండును. ఆయన వారి దేశమును మనకు స్వాస్థ్యముగా అప్పగించెను. ఆయన కృప నిరంతరముండును. కీర్త 136:2,10,17-21.

## సొగసైన ప్రవచనాలు

యెహోవా కోపము సమస్తజనముల మీదికి వచ్చుచున్నది. వారి సర్వసైన్యముల మీద ఆయన క్రోధము వచ్చుచున్నది. ఆయన వారిని శపించి వధకు అప్పగించెను. వారిలో చంపబడినవారు బయట వేయబడెదరు. వారి శవములు కంపు కొట్టును. వారి రక్తము వలన కొండలు కరిగిపోవును. ఆకాశసైన్యమంతయు క్షీణించును. కాగితపు చుట్టవలె ఆకాశవైశాల్యములు చుట్టబడును .... యెహోవా ఖడ్గము రక్తమయమగును. అది క్రొవ్వుచేత కప్పబడును. యెష 34:2–6

వారి కుమారులను క్షామమునకు అప్పగింపుము, ఖడ్గబలమునకు వారిని అప్పగింపుము, వారి భార్యలు పిల్లలు లేనివారై విధవరాండ్రగుదురుగాక, వారి పురుషులు మరణహతులగుదురుగాక. యిర్మీ 18:21.

యెహోవా సెలవిచ్చినట్లు ...ఏ పట్టణమును తప్పించుకొనజాలదు లోయ కూడ నశించును. మైదానము పాడైపోవున....యెహోవా కార్యమును అశ్రద్ధగా చేయువాడు శాపగ్రస్తుడగునుగాక. రక్తము ఒడ్చకుండ ఖడ్గము దూయువాడు శాపగ్రస్తుడగునుగాక. యిర్మీ 48:8–10.

## భలే దేవుడు

యౌవనుడు వృద్ధుడును వీధులలో నేలను పడియున్నారు. నా కన్యకలును నా యౌవనులును ఖడ్గము చేత కూలియున్నారు. నీ ఉగ్రత దినమున నీవు వారిని హతము చేసితివి. దయతలచక వారినందరిని వధించితివి. విలా 2:21,

నా ప్రాణమునకు ఆయనపొంచియున్న ఎలుగుబంటివలె ఉన్నాడు. చాటైన చోటులలో నుండు సింహమువలె ఉన్నాడు. నాకు త్రోవలేకుండచేసి నా యవయవములను విడదీసియున్నాడు. నాకు దిక్కులేకుండ చేసియున్నాడు. విలా 3:10.11.

కాబట్టి నేనువారికి సింహము వంటి వాడనైతిని; చిరుతపులి మార్గమునపొంచియున్నట్లు నేనువారిని పట్టుకొనన పొంచియుందును. పిల్లలు పోయిన యెలుగుబంటి యొకనిమీద పడునట్లు నేను వారిమీదపడి వారి రొమ్మును చీల్చివేయుదును; అడు

సింహము ఒకని మ్రింగి వేయునట్లు వారిని మ్రింగివేతును. దుష్టమృగములు వారిని చీల్చివేయును. హోషే 13:7,8.

దూరమున నున్నవారు తెగులు చేత చత్తురు, దగ్గర నున్నవారు ఖడ్గము చేత కూలుదురు, శేషించి ముట్టడి వేయబడినవారు క్షామముచేత చత్తురు; ఈ ప్రకారము నేను వారిమీద నా క్రోధము తీర్చుకొందును... వారి జనులు హతులైయుండు కాలమున నేనే యెహోవానై యున్నానని మీరు తెలిసికొందురు.

యెహె 6 : 12, 13.

తీగె ముక్కునకు పెట్టుచుమరి యెక్కువగా నాకు కోపము పుట్టించుదురు, కాబట్టి కటాక్షములేకయు కనికరము చూపకయు నేను నా క్రోధమునగపరుచుదును.

యెహె 8:17,18.

యెహోవా దినము వచ్చుచున్నది ఘోషించుడి. అది ప్రళయమువలె సర్వశక్తుడగు దేవుని యొద్దనుండి వచ్చును.. యెహోవా దినము వచ్చుచున్నది. దేశమును పాడుజేయుటకును పాపులకను బొత్తిగా దానిలో నుండకుండ నశింపజేయుటకును క్రూరమైన ఉగ్రతతోను ప్రచండమైన కోపముతోను అది వచ్చును .. వారు చూచుచుండగా వారి పసిపిల్లలు నలుగగొట్టబడుదురు. వారి యిండ్లు దోచుకొనబడును. వారి భార్యలు చెరుపబడుదురు. వారిమీద పడుటకు నేను మాదీయులను రేపుదును.... వారి విండ్లు యౌవనస్థులను నలుగగొట్టును. గర్భఫలమందువారు జాలిపడరు. పిల్లలనుచూచి కరుణింపరు. యెష 13:9,9 16-18.

యెహోవా రోషముగలవాడై .... ప్రతీకారము చేయును. ఆయన మహోగ్రత గలవాడు, యెహోవా తన శత్రువులకు ప్రతీకారము చేయును, తనకు విరోధులైన వారిమీద కోపముంచుకొనును....యెహోవా తుఫానులోను సుడిగాలిలోను వచ్చువాడు....ఆయనకు భయపడి పర్వతములు కంపించును, కొండలు కరిగిపోవును, ఆయన ఎదుట భూమి కంపించును, లోకమును అందలి నివాసులందరును వణుకుదురు. ఆయన ఉగ్రతను సహింపగలవాడెవ్వడు ? ఆయన కోపాగ్ని యెదుట నిలువగల వాడెవడు ? ఆయన కోపము అగ్నివలె పారును, ఆయన కొండలను కొట్టగా అవి బ్రద్దలగును. నహూ 1:2-6.

ఆయన పాదములవెంట అగ్ని మెరుపులు వచ్చుచున్నవి. ఆయన నిలువబడగా భూమి కంపించును హబ 3:5.

ఏమియు విడువకుండ భూమి మీదనున్న సమస్తమును నేను ఊడ్చివేసెదను; ఇదే యెహోవా వాక్కు. మనుష్యులనేమి పశువులనేమి నేను ఊడ్చివేసెదను; ఆకాశ పక్షులనేమి సముద్రమత్స్యములనేమి... నేను ఊడ్చివేసెదను. భూమిమీద ఎవరును లేకుండ మనుష్యజాతిని నిర్మూలము చేసెదను. ఇదే యెహోవా వాక్కు.

జెఫ 1:2,3

## పాత నిబంధనలోని అత్యాచారాలను సమర్థించిన క్రొత్త నిబంధన:

మోషేయు ప్రవక్తలును (చెప్పిన మాటలు) వారు వినని యెడల మృతులలో నుండి ఒకడు లేచినను వారు నమ్మరని అతనితో చెప్పెను. లూకా 16:31

ధర్మశాస్త్రము * నైనను ప్రవక్తల వచనములనైనను కొట్టివేయ వచ్చితినని తలంచవద్దు; నెరవేర్చుటకేగాని కొట్టివేయుటకు నేనురాలేదు. ఆకాశమును భూమియు గతించి పోయిననేగాని ధర్మశాస్త్రముమంతయు నెరవేరువరకు దానినుండి యొక పొల్లయినను ఒక సున్నయైనను తప్పిపోదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. కాబట్టి ఈ ఆజ్ఞలలో మిగుల అల్పమైన యొకదానినైనను మీరి, మనుష్యులకు ఆలాగున చేయ బోధించువాడెవడోవాడు పరలోక రాజ్యములో మిగుల అల్పుడనబడును. అయితే వాటనిగైకొని బోధించువాడెవడో వాడు పరలోక రాజ్యములో గొప్పవాడనబడును. మత్త 5:17-19.

ధర్మశాస్త్రములో ఒక పొల్లయినను తప్పిపోవుటకంటె ఆకాశమును భూమియు గతించి పోవుట సులభము. లూకా 16 : 17.

దైవజనుడు సన్నద్ధుడై ప్రతి సత్కార్యమునకు పూర్ణముగా సిద్ధపడి యుండునట్లు దైవావేశము వలన కలిగిన ప్రతిలేఖనము ఉపదేశించుటకును, ఖండించుటకును తప్పుదిద్దుటకును, నీతియందు శిక్షచేయుటకును ప్రయోజనకరమైయున్నది.

2 తిమో 3:16,17.

*యూదుల వాడుక ప్రకారం "ధర్మశాస్త్రము" అనగా గ్రంథపంచకము (యోహా 1:17;8:5). ధర్మశాస్త్రం పేర్కొన్నరీతిలో బానిసత్వాన్ని యేసు అనుమతించాడు. దయాదాక్షిణ్యాలు లేకుండ అన్యమతస్థుల్ని, విశ్రాంతి దినం ఆచరించనివాళ్లను, మంత్రకత్తెలను సంహరించడానికి కూడ ఈ ప్రకారం తన ఆమోదాన్ని తెలియజేశాడు.

లేఖనములయందు మీకు నిత్యజీవముకలదని తలంచుచు వాటిని పరిశోధించు చున్నారు. అవే నన్ను గూర్చి సాక్ష్యమిచ్చుచున్నవి....ఆతడు నన్ను గూర్చివ్రాసెను గనుక మీరు మోషేను నమ్మినట్టయిన నన్నును నమ్ముదురు. మీ రతని లేఖనములను నమ్మనియెడల నా మాటలు ఏలాగు నమ్ముదురనెను.

యోహా 5 : 39, 46, 47.

అందుకాయన - అవివేకులారా, ప్రవక్తలు చెప్పిన మాటలన్నిటిని నమ్మని మందమతులారా....మోషేయు సమస్త ప్రవక్తలును మొదలుకొని లేఖనములన్నిటిలో తన్ను గూర్చిన వచనముల భావము వారికి తెలిపెను. లూకా 24:25, 27.

అబ్రాహాము శోధింపబడి విశ్వాసమునుబట్టి ఇస్సాకును బలిగా అర్పించెను.... విశ్వాసమునుబట్టి యేడు దినములవరకు ప్రదక్షిణము చేయబడిన తరువాత యెరికో గోడలు కూలెను. విశ్వాసమునుబట్టి రాహాబను వేశ్య వేగులవారిని సమాధానముగా చేర్చుకొనినందున అవిధేయులతోపాటు నశింపకపోయెను.

హెబ్రీ 11 : 17, 30, 31.

మన పితరుడైన అబ్రాహాము తన కుమారుడైన ఇస్సాకును బలిపీఠముమీద అర్పించినప్పుడు అతడు క్రియల వలన నీతిమంతుడని తీర్పు నొందలేదా ? విశ్వాసము అతని క్రియలతో కూడి కార్యసిద్ధి కలుగజేసెననియు, క్రియల మూలముగా అతని విశ్వాసము పరిపూర్ణమైనదనియు గ్రహించుచున్నావు గదా.

యాకో 2 : 21, 22.

## అత్యాచారాలలో పాతనిబంధనకు తీసిపోని క్రొత్త నిబంధన!

రెండు చేతులను రెండు పాదములును కలిగి నిత్యాగ్నిలో పడవేయబడుట కంటె కుంటివాడవుగనో అంగహీనుడవుగనో జీవములో ప్రవేశించుట నీకు మేలు.

మత్త 18 : 8.

అప్పుడాయన యెడమవైపున ఉండు వారిని చూచి — శపించబడిన వారలారా నన్ను విడిచి అపవాదికిని వాని దూతలకును సిద్ధపరచబడిన నిత్యాగ్నిలోనికి పోవుడి.... వీరు నిత్యశిక్షకును నీతిమంతులు నిత్యజీవమునకు పోవుదురు.

మత్త 25 : 41, 46.

నీ చెయ్యి నిన్ను అభ్యంతరపరచినయెడల దానిని నరికివేయుము; నీవు రెండు చేతులు కలిగి నరకములోని ఆరని అగ్నిలోనికి పోవుటకంటె అంగహీనుడవై జీవములో ప్రవేశించుట మేలు. నీపాదము నిన్ను అభ్యంతరపరచినయెడల దానిని నరకి వేయుము; రెండు పాదములు కలిగి నరకములో పడవేయబడుటకంటె, కుంటివాడవై (నిత్య)జీవములోనికి ప్రవేశించుట మేలు. నీకన్ను నిన్ను అభ్యంతరపరచినయెడల దాని తీసి పారవేయుము; రెండు కన్నులు కలిగి నరకములో పడవేయబడుటకంటె ఒంటి కన్ను గలవాడవై దేవుని రాజ్యములో ప్రవేశించుట మేలు. నరకమునవారి పురుగుచావదు; అగ్ని ఆరదు. మార్కు 9:43-48.

ఎవరికి మీరు భయపడవలెనో మీకు తెలియజేయుదును; చంపిన తరువాత నరకములో పడద్రోయ శక్తిగలవానికి భయపడుడి, ఆయనకే భయపడుడని మీతో చెప్పుచున్నాను. లూకా 12:5. (మత్త 10:28 కూడ చూడండి)

సర్పములారా, సర్పసంతానమా, నరక శిక్షను మీరేలాగు తప్పించుకొందురు? మత్త 23:33.

## నరకమునుగూర్చి యేసు వర్ణన !

అప్పుడతడు పాతాళములో బాధపడుచు, కన్నులెత్తి దూరమునుండి అబ్రాహామును ఆతని రొమ్ము న (ఆనుకొనియున్న) లాజరును చూచి-తండ్రివైన అబ్రాహామా, నాయందు కనికరపడి తన వ్రేలికొనను నీళ్లలో ముంచినా నాలుకను చల్లార్చుటకు లాజరును పంపుము; నేను ఈ అగ్నిజ్వాలలో యాతనపడుచున్నానని కేకలు వేసిచెప్పెను. లూకా 16:23,24.

(కొంతమంది ఆధునిక క్రైస్తవులు ఈ విషయాన్ని అలంకార ప్రాయమైనదిగా కొట్టి వేస్తున్నారు. అయితే ఇది మనసు పడే బాధను వర్ణించినట్టా? లేక శరీరం పడే బాధను వర్ణించినట్టా? నిత్య శిక్షఅంటే ఖచ్చితంగా మత్త 25:46లో పేర్కొన్న నిత్య శిక్షే అవుతుంది. క్రీస్తు ఈ రకమైన మాటలు ఒట్టి రూపాలంకారానికే చెప్పివుంటే క్రైస్తవ మత ప్రాబల్యంవున్న ప్రాంతవాసుల్ని సుమారు 2 వేల సంవత్సరాల నుండి నీచ మైన అబద్ధాలు, దుర్మార్గమైన బెదిరింపులతో భయపెట్టిన నేరస్థుడవుతాడు)

## యోహాను నరక వర్ణన !

క్రూరమృగమునకుగాని దాని ప్రతిమకుగాని ఎవడైనను నమస్కారముచేసి తన నొసటియందేమి చేతిమీదనేమి ఆ ముద్ర వేయించుకొనినయెడల ఏమియు కలప

బడకుండ దేవుని ఉగ్రత పాత్రలో పోయబడిన దేవుని కోపమను మద్యమును వాడు త్రాగును. పరిశుద్ధ దూతల యెదుటను గొఱ్ఱె పిల్లయెదుటను అగ్ని గంధకములచేత వాడు బాధింపబడును. వారి బాధ సంబంధమైన పొగ యుగయుగములు లేచును; ఆ క్రూరమృగమునకుగాని దాని ప్రతిమకుగాని నమస్కారము చేయువారును, దాని పేరుగల ముద్ర యెవడైనను వేయించుకొనినయెడల వాడును రాత్రింబగళ్లు నెమ్మది లేనివారై యుందురు. ప్రక 14:9–11.

అటు తరువాత బహుజనుల స్వరము వంటి గొప్ప స్వరము పరలోకమందు ఈలాగు చెప్పగా వింటిని–ప్రభువును స్తుతించుడి....మరి రెండవసారి వారు–ప్రభువుని స్తుతించుడి అనిరి. ఆ పట్టణపు పొగ యుగయుగములు పైకిలేచుచున్నది అప్పుడు ఆ ఇరువది నలుగురు పెద్దలును నాలుగు జీవులును సాగిలపడి-ఆమేన్, ప్రభువును స్తుతించుడి అని చెప్పుచు సింహాసనాసీనుడగు దేవునికి నమస్కారము చేసిరి. ప్రక 19:1-4.

వారిద్దరు గంధకముతో మండు అగ్నిగుండములో ప్రాణముతోనే వేయబడిరి. ప్రక19:20.

మరియు పెద్ద సంకెళ్లను చేతపట్టుకొని అగాధముయొక్క తాళపుచెవిగల యొక దేవదూత పరలోకమునుండి దిగివచ్చుట చూచితిని. ఆతడు ఆది సర్పమును అనగా అపవాదియు సాతానును అను ఆ ఘట సర్పమును పట్టుకొని వెయ్యి సంవత్సరములు వానిని బంధించి అగాధములో పడవేసి ఆ వెయ్యి సంవత్సరములు గడచు వరకు ఇక జనులను మోసపరచకుండునట్లు అగాధమును మూసి దానికి ముద్ర వేసెను. ప్రక 20:1-3.

వారిని మోసపరచిన అపవాది అగ్నిగంధకములు గల గుండములో పడవేయబడెను. అచ్చట ఆ క్రూరమృగమును అబద్ధప్రవక్తయు ఉన్నారు; వారు యుగయుగములు రాత్రింబగళ్లు బాధింపబడుదురు. ప్రక 20:10.

## నరక బాధలన్నిటికి మూలం ఆదాము చేసిన పాపం

తీర్పు ఒక్క అపరాధమూలమున వచ్చినదై మనుష్యులకందరికిని శిక్షావిధి కలుగుటకు....కారణమాయెను. రోమీ 5:18

(రోమీ 5:12,17,19; 1 కొరిం 15:21,22; గల 3:22; అపొ 4:12 కూడ చూడండి)

## మానవజాతిలో అధికభాగం నరకానికి పోతారు

జీవమునకు పోవు మార్గము ఇరుకును ఆ దారి సంకుచితమునై యున్నది, దాని కనుగొనువారు కొందరే. మత్త 7:14.

అక్కడ ఏడ్పును పండ్లు కొరుకుటయు ఉండును....కాగా పిలువబడినవారు అనేకులు, ఏర్పరచబడినవారు కొందరే. మత్త 22:13,14.

ఒకడు-ప్రభువా, రక్షణపొందువారు కొద్దిమందేనా? అని ఆయన నడుగగా ఆయన వారిని చూచి-ఇరుకుద్వారమున ప్రవేశింప పోరాడుడి; అనేకులు ప్రవేశింప జూతురుగాని వారివలన కాదని మీతో చెప్పుచున్నాను. లూకా 13:23,24.

## విగ్రహారాధకులు నరకానికి పోతారు

విగ్రహారాధకులు .... అగ్ని గంధకములతో మండు గుండములో పాలు పొందుదురు. ప్రక 21 : 8. (ప్రక 22:15; 1 కొరిం 6:9 కూడ చూడండి)

(ఈ ప్రకారం జరిగితే హిందువులు, ఆఫ్రికనులు మొత్తం వారెప్పుడూ వినివుండని నరకానికి పోయి అక్కడ శిక్ష అనుభవించాలి)

## దేవుడిని ఎరుగని వారికి దండన :

ప్రభువైన యేసు తన ప్రభావమును కనుపరచు దూతలతో కూడ పరలోకము నుండి అగ్నిజ్వాలలలో ప్రత్యక్షమై దేవుని నెరుగని వారికిని, మన ప్రభువైన యేసు సువార్తకు లోబడని వారికిని....నిత్యనాశనమును దండన పొందుదురు.

2 థెస్స 1 : 7 _ 9.

ఈ నామముననే మనము రక్షణ పొందవలెనుగాని, ఆకాశము క్రింద మను మనుష్యులలో ఇయ్యబడిన మరి ఏ నామమున రక్షణ పొందలేము.

అపొ 4 : 12.

దుష్టులును దేవుని మరచు జనులందరును పాతాళమునకు దిగి పోవుదురు.

కీర్త 9 : 17.

## అవివేకిని అవివేకి అనిపిలిస్తే నరకాగ్నికి పోతారు !

ద్రోహి అని చెప్పువాడు నరకాగ్నికి లోనగును. మత్త 5:22.

[ఇంగ్లండు ప్రజలలో "చాలమంది అవివేకులు" అని వర్ణించిన కార్లైల్ తప్పక నరకాగ్నిలోనికి పోవాలి. యేసుక్రీస్తు కూడ ప్రజల్ని అవివేకులని పిలవడమేగాక (మత్త 23:17; లూకా 11:40; లూకా 24:25) సర్పములని, సర్ప సంతానమని, నరశిక్షకు పోయే వాళ్ళని (మత్త 23:33: మత్త 3:7: మత్త 12:34) అన్నాడు. కాబట్టి యేసు కూడ స్వయంగా నరకాగ్నిలోనికి పోవలసినవాడే!]

[ఆంగ్ల అనువాదంలో "Fool" అని వున్న పదాన్ని పరిశుద్ధ గ్రంథము మత్త 5:12లో "ద్రోహి" అని, అదే "Fool" అన్నపదాన్ని మత్త 23:17; లూకా 11:40; లూకా 24:25 లలో "అవివేకి" అని అనువదించారు. నూతన అనువాదాల్లో చేస్తూవస్తున్న మార్పులను గమనించండి. అను]

## అవిశ్వాసులకు తప్పని నరకాగ్ని

పిరికివారును, అవిశ్వాసులును, వ్యభిచారులును, మాంత్రికులును, విగ్రహారాధకులును, అబద్ధికులందరును అగ్నిగంధకములతో మండు అగ్నిగుండములో పాలు పొందుదురు. ప్రక 21:8.

కుమారునికి విధేయుడు కానివాడు జీవము చూడడుగాని దేవుని ఉగ్రత వాని మీద నిలిచియుండును. యోహా 3:36.

దాసుని యజమానుడు .. అపనమ్మకస్థులతో వానికి పాలు నియమించును. లూకా 12.46.

నమ్మనివానికి శిక్ష విధింపబడును. మార్కు 16:16.

## ధనవంతులకు విధించబడే దండన

ధనవంతుడు పరలోక రాజ్యములో ప్రవేశించుట కంటె సూది బెజ్జములో ఒంటెదూరుట సులభము. మత్త 19.24.

అయ్యో, ధనవంతులారా మీరు (కోరిన) ఆదరణ మీరు పొందియున్నారు.

(ధనవంతుడు పాతాళానికిపోయి పడేబాధలను యేసు వర్ణించిన విధముకొరకు లూకా 16:19-31 చూడండి)

## ఎదురులేని సాతాను

మీ విరోధియైన అపవాది గర్జించు సింహమువలె ఎవరిని మ్రింగుదునా అని వెదకుచు తిరుగుచున్నాడు. 1 పేతు 5:8

దుర్నీతిని పుట్టించు సమస్తమోసముతోను, నశించుచున్నవారిలో సాతాను కనుపరచు బలమును అనుసరించి యుండును 2 థెస్స 2:9,10.

## మానవులను పట్టుకునేందుకు దయ్యాలకు అనుమతిచ్చిన దేవుడు :

జన సమూహములో ఒకడు బోధకుడా, నా కుమారుని కటాక్షించుమని నిన్ను వేడుకొనుచున్నాను. వాడు నాకొక్కడే కుమారుడు. ఇదిగో ఒక దెయ్యము వాని పట్టును, పట్టినప్పుడు వాడు అకస్మాత్తుగా కేకలు వేయును; నురుగుకారునట్లు అది వానిని విలవిలలాడించుచు గాయపరచుచు వానిని వదలి వదలకుండును. దానిని వెళ్లగొట్టుడని నీ శిష్యులను వేడుకొంటినిగాని వారిచేత కాలేదు....వాడు వచ్చుచుండగా ఆ దయ్యము వానిని పడద్రోసి, విలవిలలాడించెను. లూకా 9:38.42.

సాయంకాలమైనప్పుడు జనులు దయ్యములు పట్టిన అనేకులను ఆయనయొద్దకు తీసికొనివచ్చిరి. మత్త 8:16.

ఏడు దయ్యములు వదలిపోయిన మగ్దలేనే అనబడిన మరియయు... ఆయనతో కూడ వుండిరి. లూకా 8:2.

## అపరాధిపట్ల దేవునికోపం పోవాలంటే నిరపరాధిని బలి యివ్వాలి,

క్రీస్తు అను మన పస్కా పశువు వధింపబడెను. 1 కొరిం 5:7.

ఆయన పాపము చేయలేదు; ఆయన నోటను ఏ కపటమును కనబడలేదు. 1 పేతు 2:22.

ఆయన యుగముల సమాప్తియందు తన్నుతానే బలిగా అర్పించుకొనుట వలన పాప నివారణ చేయుటకై యొక్కసారే ప్రత్యక్షపరచబడెను. హెబ్రీ 9:26.

పాపమెరుగని ఆయనను మనకోసము పాపముగా చేసెను. 2 కొరిం 5 : 21.

ఎవడైనను పాపముచేసిన యెడల నీతిమంతుడైన యేసుక్రీస్తు అను ఉత్తరవాది తండ్రియొద్ద మనకున్నాడు. ఆయనే మన పాపములకు శాంతికరమైయున్నాడు.

మన పాపములకు మాత్రమేకాదు, సర్వలోకమునకు శాంతికరమైయున్నాడు.
1 యోహా 2:1,2.

మన పాపముల విషయమై చనిపోయి, నీతి విషయమై జీవించునట్లు ఆయన తానే తన శరీరమందు మన పాపములను మ్రానుమీద మోసికొనెను. ఆయన పొందిన గాయముల చేత మీరు స్వస్థతనొందిరి. 1 పేతు 2:24.

## పాప ప్రక్షాళన జరగాలంటే రక్తం ధార పోయాలి !

ఆయన కుమారుడైన యేసు రక్తము ప్రతి పాపము నుండి మనలను పవిత్రులనుగా చేయును. 1 యోహా 1:7.

ధర్మశాస్త్ర ప్రకారము సమస్త వస్తువులును రక్తము చేత శుద్ధి చేయబడుననియు, రక్తము చిందింపకుండ పాపక్షమాపణ కలుగదనియు సామాన్యముగా చెప్పవచ్చును....అలాగుననే క్రీస్తుకూడ అనేకుల పాపములను భరించుటకు ఒక్కసారే అర్పింపబడెను. హెబ్రీ 9:22,28.

ఇది నా రక్తము, అనగా పాపక్షమాపణ నిమిత్తము అనేకుల కొరకు చిందింపబడుచున్న నిబంధన రక్తము. మత్త 26:28.

దేవుడు తన స్వరక్తమిచ్చి సంపాదించిన తన సంఘమును కాయుటకు.... జాగ్రత్తగా ఉండుడి. అపొ 20:28.

ఆయన రక్తము వలన మనకు విమోచనము, అనగా మన అపరాధములకు క్షమాపణ మనకు కలిగియున్నది. ఎఫె 1:7.

మనలను ప్రేమించుచు తన రక్తము వలన మన పాపముల నుండి మనలను విడిపించిన వానికి మహిమ....కలుగును గాక. ప్రక 1:5,6.

నీవు వధింపబడినవాడవై నీ రక్తమిచ్చి ...మనుష్యులనుకొని....యాజకులనుగాను చేసితివి. ప్రక 5:9,10.

మేకలయొక్కయు కోడెలయొక్కయు రక్తముతోకాక, తన స్వరక్తముతో ఒక్కసారే పరిశుద్ధ స్థలములో ప్రవేశించెను. ఏలయనగా మేకలయొక్కయు, ఎడ్లయొక్కయు రక్తమును; మైలపడిన వారిమీద ఆవుదూడ బూడిదె చల్లుటయు శరీరశుద్ధి కలుగునట్లువారిని పరిశుద్ధపరచిన యెడల, నిత్యుడగు ఆత్మద్వారా తన్నుతాను

దేవునికి నిర్దోషినిగా అర్పించుకొనిన క్రీస్తుయొక్క రక్తము నిర్జీవక్రియలను విడిచి జీవముగల దేవుని సేవించుటకు మీ మనస్సాక్షిని ఎంతో యెక్కువగా శుద్ధిచేయును.
హెబ్రీ 9:12-14.

(కొలొ 1:14; ప్రక 7:14; హెబ్రీ 10:29; 1 పేతు 1:2 కూడ చూడండి)

**మానవులను పాపులుగా తయారుచేసిన తండ్రి అందుకు తగిన శిక్ష తాను విధించుకోవాల్సిందిపోయి, ఆ తప్పుకు తన ఒక్కగానొక్క కొడుకును వేదనతో కూడిన మరణానికి గురిచేశాడు !**

దేవుడు ఈలోకమును ఎంతగానో ప్రేమించెను. కాగా ఆయన తన అద్వితీయ కుమారునిగా పుట్టిన వానియందు విశ్వాసముంచు ప్రతివాడును నశింపక నిత్య జీవము పొందునట్లు అనుగ్రహించెను. యోహా 3:16.

ఆయన....మరణము పొందునంతగా, అనగా సిలువ మరణము పొందునంతగా, విధేయత చూపినవాడై, తన్నుతాను తగ్గించుకొనెను. ఫిలి 2:8.

ఆయన సిలువ రక్తముచేత సంధిచేసి ...సమాధాన పరచుకొనవలెనని తండ్రి అభీష్టమాయెను. కొలొ 1:19,20.

మన పాపములకు ప్రాయశ్చిత్తమై యుండుటకు తన కుమారుని పంపెను.
1 యోహా 4:10.

క్రీస్తు మన కోసము శాపమై మనలను ధర్మశాస్త్రముయొక్క శాపము నుండి విమోచించెను. గల 3:13,14.

దేవుడొక్కడే, దేవునికిని నరులకును మధ్యవర్తియు ఒక్కడే; ఆయన క్రీస్తుయేసను నరుడు. ఈయన అందరి కొరకు విమోచన క్రయ ధనముగా తన్నుతానే సమర్పించుకొనెను. 1 తిమో 2:5,6.

అయినను మునుపు దూరస్థులైన మీరు ఇప్పుడు క్రీస్తుయేసునందు క్రీస్తు రక్తము వలన సమీపస్థులైయున్నారు... తన సిలువ వలన ఆ ద్వేషమును సంహరించి, దానిద్వారా వీరిద్దరిని ఏక శరీరముగా చేసి, దేవునితో సమాధాన పరచవలెనని యీలాగు చేసెను. ఎఫె 2:13,16.

నమ్మువారు ఆయన కృపచేతనే, క్రీస్తు యేసునందలి విమోచనము ద్వారా ఉచితముగా నీతిమంతులని తీర్చబడుచున్నారు. పూర్వము చేయబడిన పాపములను దేవుడు తన ఓరిమి వలన ఉపేక్షించినందున ఆయన తననీతిని కనపరచవలెనని క్రీస్తు యేసురక్తము నందలి విశ్వాసము ద్వారా ఆయనను కరుణాధారముగా బల పరచెను. రోమీ 3:24-26.

ఆయన మన అపరాధముల నిమిత్తము అప్పగింపబడి, మనము నీతి మంతులుగా తీర్చబడుటకై లేపబడెను. రోమీ 4 : 25.

కాబట్టి విశ్వాస మూలమున మనము నీతిమంతులముగా తీర్చబడి, మన ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా దేవునితో సమాధానము కలిగియుందము....క్రీస్తు యుక్తకాలమున భక్తిహీనుల కొరకు చనిపోయెను....ఎట్లనగా మనమింకను పాపులమై యుండగానే క్రీస్తు మనకొరకు చనిపోయెను. కాబట్టి ఆయన రక్తము వలన ఇప్పుడు నీతిమంతులముగా తీర్చబడి, మరింత నిశ్చయముగా ఆయన ద్వారా ఉగ్రతనుండి రక్షింబడుదుము .... ఆయన కుమారుని మరణము ద్వారా మనము దేవునితో సమాధాన పరచబడి....ఆయన ద్వారానే మనము ఇప్పుడు సమాధాన స్థితి పొందియున్నాము.

రోమీ 5:1,6,8-11.

## మానవులను శిక్షించడానికి దేవుడి కుట్ర

సత్యమును నమ్మక దుర్నీతియందు అభిలాషగల వారందరును శిక్షావిధి పొందుటకై, అబద్ధమును నమ్మునట్లు మోసముచేయు శక్తిని దేవుడు వారికి పంపుచున్నాడు. 2 థెస్స 2:11,12.

## క్రీస్తు ఉపమానాలు చెప్పడం ప్రజల రక్షణకు కాదా?

వెలుపల నుండువారు ఒకవేళ దేవునివైపు తిరిగి పాప క్షమాపణ పొందుదురని, వారు చూచుటకైతే చూచియు కనుగొనకను, వినుటకైతే వినియు గ్రహింపకయు నుండుటకును అన్నియు ఉపమానరీతిగా వారికి బోధింపబడుచున్నవి.

మార్కు 4:11.12.

## దేవుడు ప్రజల హృదయాలను కఠిన పరచడంలోని రహస్యం

ఇందుచేత వారు నమ్మలేక పోయిరి. ఏలయనగా—వారు కన్నులతో చూచి హృదయముతో గ్రహించి మనస్సు మార్చుకొని నా వలన స్వస్థపరచబడకుండునట్లు

ఆయన వారి కన్నులకు అంధత్వము కలుగజేసి వారి హృదయమును కఠిన పరచెను.
యోహా 12:39,40.

## మానవుడు నరకానికి పోకుండ తన్ను తాను రక్షించుకోలేని నిస్సహాయుడు

కాగా పొందగోరువాని వలననైనను, ప్రయాసపడు వానివలననైనను కాదు గాని, కరుణించు దేవుని వలననే అగును....కావున ఆయన ఎవనిని కనికరింపగోరునో వానిని కనికరించును; ఎవనిని కఠినపరచగోరునో వాని కఠినపరచును ....ఒకముద్దలో నుండియే యొక ఘటము ఘనతకును ఒకటి ఘనహీనతకును చేయుటకు మంటిమీద కుమ్మరివానికి అధికారము లేదా? అలాగు దేవుడు తన ఉగ్రతను అగపరచుటకును, తన ప్రభావమును చూపుటకును, ఇచ్ఛయించినవాడై నాశనమునకు సిద్ధపడి ఉగ్రతా పాత్రమైన ఘటములను ఆయన బహుదీర్ఘ శాంతముతో సహించిననేమి ?
రోమీ 9:16,18.21,22. (రోమీ 9:11-13 కూడ చూడండి)

## విధి దైవసంకల్పం

తన కుమారుడు అనేక సహోదరులలో జ్యేష్ఠుడగునట్లు, దేవుడెవరిని ముందు ఎరిగెనో, వారు తన కుమారునితో సారూప్యముగల వారగుటకు వారిని ముందుగా నిర్ణయించెను. మరియు ఎవరిని ముందుగా నిర్ణయించెనో వారిని పిలిచెను; ఎవరిని పిలిచెనో వారిని నీతిమంతులుగా తీర్చెను; ఎవరిని నీతిమంతులుగా తీర్చెనో వారిని మహిమ పరచెను. రోమీ 8:29,30.

ఇశ్రాయేలు వెదుకునది ఏదో అదివారికి దొరకలేదు. ఏర్పాటునొందిన వారికి అది దొరికెను; తక్కినవారు కఠినచిత్తులైరి. ఇందు విషయమై నేటివరకు దేవుడు వారికి నిద్రమత్తుగల మనస్సును, చూడలేని కన్నులను, వినలేని చెవులను ఇచ్చి యున్నాడని వ్రాయబడి యున్నది. మరియు వారిభోజనము వారికి ఉరిగాను, బోను గాను, ఆటంకముగాను వారి క్రియలకు ప్రతిఫలముగాను ఉండును గాక. వారు చూడ కుండునట్లు వారి కన్నులకు చీకటి కమ్మునుగాక. వీరి వీపును ఎల్లప్పుడును వంగి పోవునట్లు చేయుము అని దావీదు చెప్పుచున్నాడు. రోమీ 11:7-10.

తన చిత్త ప్రకారమైన దయాసంకల్పము చొప్పున, యేసుక్రీస్తు ద్వారా తనకు కుమారులనుగా స్వీకరించుటకై, మనలను ముందుగా తన కోసము నిర్ణయించు కొని ...ఏర్పరచుకొనెను. ఎఫె 1:4,5

ఎవని పేరైనను జీవగ్రంథమందు వ్రాయబడినట్టు కనబడనియెడల వాడు అగ్నిగుండములో పడవేయబడెను. ప్రక 20:15.

## ఇది మత ధర్మమా ?

దేవునిచేత ఏర్పరచబడిన వారిమీద నేరము మోపువాడెవడు ? నీతిమంతులుగా తీర్చువాడు దేవుడే. రోమీ 8:33.

విశ్వసించు ప్రతివాడును ఈయన వలననే నీతిమంతుడుగా తీర్చబడును.
అపొ 13:39.

అన్నిటియందు నాకు స్వాతంత్ర్యము కలదుగాని అన్నియు చేయదగినవి కావు. అన్నిటియందు నాకు స్వాతంత్ర్యము కలదుగాని నేను దేని చేతను లోపరచు కొనబడనొల్లను. 1 కొరిం 6:12.

దేవుని మూలముగా పుట్టిన ప్రతివానిలో ఆయన బీజము నిలుచును గనుక వాడు పాపము చేయడు; వాడు దేవుని మూలముగా పుట్టినవాడు గనుక పాపము చేయ జాలడు. 1 యోహా 3:9.

యేసే క్రీస్తయి యున్నాడని నమ్ము ప్రతివాడును దేవుని మూలముగా పుట్టి యున్నాడు. 1 యోహా 5:1.

విశ్వాసమూలమున మనము నీతి మంతులముగా తీర్చబడుదుము.
రోమీ 5:1.

పనిచేయక భక్తిహీనుని నీతిమంతునిగా తీర్చువానియందు విశ్వాసముంచు వానికి వాని విశ్వాసము నీతిగా ఎంచబడుచున్నది ...ప్రభువుచేత నిర్దోషియని ఎంచ బడినవాడు ధన్యుడు. రోమీ 4:5,8.

పాపము నుండి విమోచింపబడి నీతికి దాసులైతిరి, రోమీ 6:18,22.

ఎవడైనను నాయొద్దకు వచ్చి తన తండ్రిని తల్లిని భార్యను పిల్లలను అన్న దమ్ములను అక్కచెల్లెండ్రను తన ప్రాణమును సహా ద్వేషింపకుంటే వాడు నా శిష్యుడు కానేరడు. లూకా 14:26.

(ధర్మవైరుధ్యం క్రైస్తవంయొక్క తార్కిక ఫలితం. దానిపై విశ్వాసం బలంగా వున్న పుడు చర్చి సభ్యులు దాని ఆచరణకోసం దుందుడుకుగా ప్రవర్తించారు. పవిత్రాత్మ వారిలో వుండి వారి ఆలోచనలని, ఆచరణని నడుపుతూ ఉంటుందని అనుకోవడంవల్ల వీరు దైవం మనుషులని, మానవ చట్టానికి అతీతులని అర్థమవుతుంది. అందువల్ల మున్‌స్టర్

వంటి మూఢ విశ్వాసులు అత్యాచారాలకు తలపడ్డారు. పైగా విశ్వాసుల పాపాలకుయేసు క్రీస్తు తనరక్తం ద్వారా ఇంతకుముందే పరిహారం చెల్లించాడు. అందువల్ల సుఖాస్పద మైన దుర్మార్గం, అనుకూలమైన నేరం పాపాలుగా పరిగణించబడలేదు. కనానీయులను, అల్బిజన్సీయులను నిర్మూలనం చెయ్యడంలో క్రైస్తవులు జరిపిన అత్యాచారాలు వారి ధర్మ దూరతకు నిదర్శనాలు)

## తమస్వంత ఆస్తిని దాచుకున్నందుకు చంపబడ్డ భార్యా భర్తలు

భూములయినను ఇండ్లయినను కలిగిన వారందరు వాటిని అమ్మి, అమ్మినవాటి వెలతెచ్చి అపొస్తలుల పాదములయొద్ద పెట్టుచువచ్చిరి వారు ప్రతి వానికి....పంచి పెట్టిరి....అననీయ అను ఒక మనుష్యుడు తన భార్యయైన సప్పీరాతో ఏకమై భూల మమ్మెను. భార్య యెరుకనే వాడు దానివెలలో కొంత దాచుకొని కొంత తెచ్చి అపొస్తలుల పాదములయొద్ద పెట్టెను. అప్పుడు పేతురు - అననీయా నీభూమి వెలలో కొంత దాచుకొని పరిశుద్ధాత్మను మోసపుచ్చుటకు సాతాను ఎందుకు నీ హృదయ మును ప్రేరేపించెను?....అననీయ ఈ మాటలు వినుచునే పడి ప్రాణము విడుగావ వినిన వారికందరికిని మిగుల భయము కలిగెను; అప్పుడు పడుచువారు లేచి వానిని బట్టతోచుట్టి మోసికొని పోయి పాతి పెట్టిరి. ఇంచుమించు మూడు గంటల సేపటికి వాని భార్య జరిగినది యెరుగక లోపలికివచ్చెను. అప్పుడు పేతురు-ప్రభువుయొక్క ఆత్మను శోధించుటకు మీరెందుకు ఏకీభవించితిరి? ఇదిగో నీ పెనిమిటిని పాతి పెట్టినవారి పాదములు వాకిటనే యున్నవి; వారు నిన్నును మోసికొని పోవుదురని ఆమెతో చెప్పెను. వెంటనే ఆమె అతని పాదములయొద్దపడి ప్రాణము విడిచెను. ఆ పడుచువారు లోపలికివచ్చి, ఆమె చనిపోయినది చూచి, ఆమెను మోసికొనిపోయి, ఆమె పెనిమిటియొద్ద పాతిపెట్టిరి. సంఘ మంతటికిని, ఈ సంగతులు వినిన వారి కందరికిని మిగుల భయము కలిగెను. అపొ 4:34,35; అపొ. 5:1-11.

## క్రైస్తవాన్ని వ్యతిరేకించి నందుకు ఒకవ్యక్తి గ్రుడ్డివాడుగా మార్చబడ్డాడు.

ఎలుమ ఆ అధిపతిని విశ్వాసమునుండి తొలగింపవలెనని యత్నముచేసి వారిని ఎదిరించెను; ఎలుమ అను పేరునకు గారడీ వాడని అర్థము. అందుకు పౌలు అనబడిన సౌలు పరిశుద్ధాత్మతో నిండినవాడై అతని తేరిచూసి-సమస్త కపటము తోను సమస్త దుర్మార్గముతోను నిండినవాడా, అపవాది కుమారుడా సమస్త నీతికి

విరోధీ నీవు ప్రభువుయొక్క తిన్నని మార్గములు చెడగొట్టుట మానవా? ఇదిగో ప్రభువు తన చెయ్యి నీమీద ఎత్తియున్నాడు, నీవు కొంతకాలము గ్రుడ్డివాడవై సూర్యుని చూడకుందువని చెప్పెను. వెంటనే మబ్బును చీకటియు అతని కమ్మెను గనుక అతడు తిరుగుచు ఎవరైన చెయ్యిపట్టుకొని నడిపింతురా అని వెదకుచుండెను.
అపొ 13:8_11.

## తీర్పు దినం

అయితే అన్నిటి అంతము సమీపమైయున్నది. కాగా మీరు స్వస్థబుద్ధి గలవారై, ప్రార్థనలు చేయుటకు మెలకువగా ఉండుడి. 1 పేతు 4:7.

అయితే లోతు సొదొమ విడిచిపోయిన దినమున ఆకాశమునుండి అగ్నిగంధకములు కురిసి వారినందరిని నాశనము చేసెను. లూకా 17:29.30.

ఇప్పుడున్న ఆకాశమును భూమియు భక్తిహీనుల తీర్పును నాశనమునుజరుగు దినము వరకు అగ్నికొరకు నిలువచేయబడినవై, అదే వాక్యమువలన భద్రము చేయబడి యున్నవి....అయితే ప్రభువు దినము దొంగవచ్చినట్లు వచ్చును. ఆ దినమున ఆకాశములు మహాధ్వనితో గతించి పోవును, పంచభూతములు మిక్కటమైన వేండ్రముతో లయమైపోవును. 2 పేతు 3:7.10.

దేవుని న్యాయమైన తీర్పు బయలు పరచబడు దినమందు నీకు నీవే ఉగ్రతను సమకూర్చుకొనుచున్నావు. రోమీ 2:5.

పెద్ద భూకంపము కలిగెను. సూర్యుడు కంబళివలె నలుపాయెను, చంద్రబింబమంతయు రక్తవర్ణమాయెను, పెద్ద గాలిచేత ఊగులాడు అంజూరపు చెట్టునుండి ఆ కాలపు కాయలురాలినట్టు ఆకాశ నక్షత్రములు భూమిమీద రాలెను. మరియు ఆకాశమండలము చుట్టబడిన గ్రంథమువలెనై తొలగిపోయెను. ప్రతి కొండయు ప్రతి ద్వీపమును వాటివాటి స్థానములు తప్పెను. భూరాజులును, ఘనులును, సహస్రాధిపతులును, ధనికులును, బలిష్ఠులును, ప్రతిదాసుడును, ప్రతి స్వతంత్రుడును కొండగుహలలోను బండల సందులలోను దాగుకొని సింహాసనాసీనుడైయున్నవాని యొక్కయు గొఱ్ఱెపిల్లయొక్కయు ఉగ్రత మహాదినమువచ్చెను: దానికి తాళజాలినవాడెవడు? ప్రక 6:12_17. (మత్త 25:31_46 కూడ చూడండి)

